శ్రీ

చిగురుపాటి బుచ్చిరామయ్య
పెనమలూరు
1953

# వేనరాజు



విశ్వనాథ సత్యనారాయణ

౧౧౧ NPRO1F 301

వేనుడు : రాజు

గౌతముడు : చెలికాడు

అంగరాజు : తండ్రి

పృథువు : మొదట చెల్లెలు, పిదప తమ్ముడు

కౌషీతకుడు : సేవకుడు

ద్యాషీతకుడు : సేవకుడు

వినీతభట్టు : వంది

శ్రీధరభట్టు : కుర్రవంది

వినీతభట్టు నల్లుడు

కాలభట్టు : ముసలిభట్టు

ఒక బ్రాహ్మణుడు

భూదేవి : వసుంధర

వినీతభట్టు ముసలివియ్యపురాలు

వినీతభట్టుకూతురు [చూలాలు)

## అంకితము

### శ్రీ బెల్లంకొండ కనకాంబారాఘవరాయ దంపతులకు

ఎన్నఁగ నీతి కొంచెవడి నీ కలివేళల దివ్యశీలసం
పన్నులె దైవతంబు లని మాటికిమాటికి మిమ్ము దేవతా
సన్నమనోజ్ఞమూర్తులఁ బ్రశంసయొనర్తును లోనలోన, నేఁ
డన్నుతి యంకితంబునకునై బయలందిన దిట్లు దివ్యమై!

సతతరసోద్గతిన్ దెనుఁగుజాతి రసజ్ఞత చావదేని నీ
కృతి చిరకాలజీవి నగుఁ గేవల మప్పటిదాక, మీరు కీ
ర్తి నవకంబు క్రొత్త సవరించిన మోహనమోహనంబు లా
కృతు లెసలారి బ్రాహ్మి చిఱుగేలికి జంటసుకంబు లౌదురున్!

మీయెడ నాయెడందకొన మేళ్ళెరసెన్ మఱి శ్రోతులందు లో
తై యివ మూరుకొంచుఁ దఱుచై జల లూరిన ప్రేమగౌరవ
శ్రీ, యది యీ నవాకృతి వరించి కృతింబలెవచ్చి యాశశి
స్థాయిగ లేఁతవెన్నెలలచాలున సేవలుపట్టు మీదెసన్!

విశ్వనాథ సత్యనారాయణ.

## నాంది

శ్రీనిత్యమోక్షలక్ష్మీనాథుఁ డగుటచే నెవుడు సంసృతిబాధ నెఱుఁగలేఁడు
ఇంద్రియాతీతనిత్యేచ్ఛుఁడై తగుటచే నీ శరీరులదుఃఖ మెంచలేఁడు
ఆద్యంతరహితకాలాకృతి యగుటచేఁ దత్కాలజనితసంతప్తి కనఁడు
పరిభూతకర్మవాగురుఁ డౌటచేఁ గర్మవృత జంతుతతిక్లేశవిధి తలఁచఁడు
దిఙ్మనఃకాలమూర్తి
మనాఙ్మనాఙ్మహితలవిలిప్తతా భ్రాంతికృన్మహస్సు
వేదవేదాంతములయందె వెలుఁగు వెలుఁగు
మలఁగు చీకటిదారులఁ దొలఁచుఁగాత!

[నాంద్యంతమున కుశీలవుఁడు ప్రవేశించి]

ఏమోయి! లవంగికా! ఇట్లు వత్తువా?

మారిషుఁడు: [ప్రవేశించి] బావా! నీ వెర్రి నీకు వదలదు.

కుశీలవుఁడు: ఇది బాగున్నది, నేను నిన్నుఁ బిలచితినా? నాభార్యను నేను పిలుచుకొంటిని.

మారిషుఁడు: చాలుగాని యూరకుండవయ్యా! నీఛాందసము పోనిచ్చితివికావు. నాంది ప్రస్తావనలు మాకు వలదో యను చుండఁగా నీ వవి మానెత్తినఁ గుక్కెద వెందులకు? ఇప్పటి మా సభాసదులకు నీప్రాఁతగోల యక్కఱలేదు. ఈ స్వగతములు దీర్ఘోపన్యాసములు కల నాటకము లాధుని కులకు రుచించవని చెప్పినను వినక యీ నాటకము నాడుటకు మాచేత ముక్కుపట్టించితివి. దాని కొప్పుకోఁగా నిప్పుడు ప్రస్తావనకు లవంగిక రావలయుఁగాఁబోలు.

కుశీలవుఁడు : ఆడుఁకొనుడోయి! మీయిష్టము వచ్చినట్లాడు కొనుఁడు, నాకెందుకు? నేను పోవుచున్నాను.

[నిష్క్రమించును]

మారిషుఁడు : ఇది వరుస. మాయింట నౌకరిమాట యొకరికి గిట్టుటలేదు. మాబావ పూర్వపద్ధతులలో మహార్థ మున్న దనును. మాకా యర్థములేమియుఁగనిపించుటలేదు. ఆయన మమ్ము సంస్కారరహితులనును. మాలోఁ గొందఱాయన నల్లరిచేయుదురు. ఏది యెట్లైనను నష్టములేదు కాని మా చెల్లెలు లవంగిక మాబావ యెంతచెప్పిన సంత. ఈ కొంచె మునకే యిప్పుడేదో విఱుచుకొని నానెత్తినఁ బడును.

[కుశీలవుని జేతఁ గొసతెచ్చుచు లవంగిక ప్రవేశించి]

లవంగిక : అన్నా ! నీ కంతకన్ననంతకన్న మతిపోవుచున్నది. సూత్రధారుఁ డనఁగా నీతో నేమని చెప్పితిని ? ఆయన సాక్షాన్నారాయణుఁడు. అపరభరతముని. భరతమునిగోడే తెలియని నీకు భరతముని యనినచో లెక్కయా! కనీస మీనాటకమునను సంబంధించినంతవరకైన నీవు మాట్లాడ కుండ నుండవలయును.

మారిషుఁడు : ఈసంగతి నాకుఁదెలియదూ ? తెలియును. బావా ! ఇంక నేమి ? కానీ !

లవంగిక : అన్నా ! నీ కిష్టము లేనిచో మేము వెడలిపోయె దము. నీవు మీబావగారి నేమనినను నేనూరకుండునదిలేదు.

మారిషుఁడు : అసలు నీ మూలముగాఁ గా దిదంతయు ?

[నిష్క్రమించును]

లవంగిక : మీరుకూడ వయసుచేతఁ జిన్నవారేకదా ? మీరు కూడ వారితోఁ గలసియుండరాదా? వారందఱు నాటకకళ వృద్ధిపొందుచున్నదందురు. మీ రేల యొప్పుకొనరాదు ?

కుశీలవుఁడు : ఈ సమాధానము నీతో నదివరకే చెప్పితిని. అది వృద్ధిపొందుటకాదు; ఆత్మవంచన - సామాజికులను వంచించుట. నాటకమునందు రసము పరమార్థవిషయమైనచో వీరి పోకడలు దుష్టములు. నాటక మనఁగా నెవనియిష్టము ప్రకారము వాఁడు తందనాలాడుటయైనచో నా కభ్యంతరము లేదు.

లవంగిక : అయినచో నాడి చూపించుఁడు.

కుశీలవుఁడు : నీవు ముందర పాడి చూపించవలయును.

లవంగిక : నేను పాడినచో మీరుఁ బనికిరాముకదా ?

కుశీలవుఁడు : మఱి నీవు హిందూస్తానీ వరుసతో నెవఁడో వ్రాసినపాట పాడెదవాయెను. అదితబలాప్రోఁత, హార్మనీ ప్రోఁతలతో సరిపోవును. ఆరాగములో భావమొప్పదు; అసలు మాటే వినఁబడదు.

లవంగిక : నేను వెడలిపోవుచున్నాను. [పోఁబోవును]

కుశీలవుఁడు : [పట్టుకొని] నీకంతకోపమెందుకు ? నేను నీకు భర్తనుగదా ? నీమధ్య నామధ్య నాలుగురోజులు వారడి. మన యారవయేట మనకుఁ బెండ్లిచేసిరి. నీవు పదుమూఁడవయేటఁ బెద్దమనిసివైతివి. నాకప్పటికి పెద్దబాలశిక్ష కాలేదు. నీకిప్పుడు పదునెన్మిదవయేఁడు వచ్చినది. అయిదు

గురు బిడ్డలతల్లివలె నున్నావు. నేను నీ చంకబిడ్డవలె నున్నాను. నీవు నాకై యిన్నాళ్ళెదురుచూచుచుఁ బాతివ్రత్యము నెరపితివి. దానికి నేను కృతజ్ఞుఁడనుగా నుండవలయును గనుక నీవు చెప్పినట్లు చేసెదను. నీ యిష్టమేమో నీవు చెప్పుము.

లవంగిక : పాటలు లేనిచో నాటకము రక్తికట్టను.

కుశీలవుఁడు : ఇది నీ యిష్టముకాదు. మీయన్నను సంతోషపెట్టుట కిట్లు చెప్పుచున్నావు.

లవంగిక : ప్రతిదియు నా యిష్టము వచ్చినట్లు చేయుదుననుటయుఁ జివరకు మీయిష్టమే జరిగించుటయు.

కుశీలవుఁడు : అది నీశీలపరిభావము. అదిగో! ఇంత పోట్లాడిన మీయన్న గౌతమునిభూమిక ధరించి వచ్చుచున్నాఁడు.

లవంగిక : అతఁడు మనసులో మీవైపే...

కుశీలవుఁడు : నా కంతేగా తృప్తి. మీరందఱు నా మాట విందురనియే కాని నా కితరమైన యాశ యున్నదా? పెండ్లినాఁటి కట్నముదగ్గరనుంచియు నిదే.

లవంగిక : మీ రెంతచేసినను మెప్పులేదు.

కుశీలవుఁడు : ఓసీ! ధర్మముచేయనిచో దోషము. చేసినచో మెప్పులేదు.

[తెర]

## మొదటి యంకము

[రాజాంతఃపురము - సెజ్జపై వేనుఁడు - ద్వారమున గౌతముఁడు]

గౌతముఁడు : నీవు వివాహము చేసికొని ప్రజల కోరిక తీర్చక తప్పదు.

వేనుఁడు : ఆ నిలుచుండుట యేమిటి? ఆ చెప్పుట యేమిటి? వచ్చికూర్చుందువా?

గౌతముఁడు : నీవు చేసికొందువా?

వేనుఁడు : నేను చేసికోను. హఠాత్తుగా వచ్చి నన్నిట్లడిగినచో నే నసలు చేసికోను. నా రాజ్యములో నెవ్వరును వివాహము చేసికోరాదని నేను చెప్పుచుండఁగా నీవునన్నుఁజేసికొమ్మందువేమి? గౌతమా, ఈ కృత్రిమ సంయోగముల వలన జగమ్ము నాశనమగుచున్నది. వివాహమన్న బంధము లేకున్న జారత్వమే లేదుగదా! జారత్వములేక పాపములేదు. పాపపుణ్యములు మనము మనకై తెచ్చికొన్న కట్టుత్రాళ్లు. ఇవి నిత్యము నీకుఁ జెప్పెడి మాటలేగదా! దానికేమి, నేను నిజముగా వివాహము చేసికొన్నచో నెవరిని చేసికొందునో తెలియునా?

గౌతముఁడు : ఎవరిని ?

వేనుఁడు : నిన్ను.

గౌతముఁడు : నన్నా! ఎందుకు! సంతానము కనుటకా?

వేనుఁడు : ఎందుకా, ప్రేమించుటకు. నీ సౌందర్యవంతమైన మొగమును జూచి చూచి మోహము పొందుటకు. నీ మనసులో సౌకుమార్యపు లోఁతులు తడవి చూచుకొనుటకు. ఆలోఁతులలో నవ్యక్తముగా దాగియున్న నూతన నూతనములైన గానమాధురులను ప్రతిధ్వనింపఁజేయుటకు!

గౌతముఁడు : వివాహము చేసికొనుట సంతానార్థము.

వేనుఁడు: సంతానార్థమా వివాహముచేసికొనుట? ఎంత యనాగరపు టూహ! ఇది ఆ స్మృతికర్తల బోధనకావలయును. ఏమి స్మృతికర్తలోయి యీ ఋషులు! చిత్రచిత్రములైన భావములు వ్యాప్తికిఁ దెచ్చినారు. దేశములో స్వతంత్ర భావములు చంపివేసినారుపో!

గౌతముఁడు : మఱి వివాహము సంతానార్థ మనియేగదా అందఱనుకొనుట.

వేనుఁడు : వా రనుకొనునట్లు చేసిన దీ ఋషులే.

గౌతముఁడు : కానిమ్ము, మనము నట్లే యనుకొనవలనఁ దప్పేమి!

వేనుఁడు : వారందరు తప్పుత్రోవ వెంటఁ బోవు చుండఁగా మనము వారిని సరియైన మార్గమునకు త్రిప్పవలయును గాని మనముగూడ వారి ననుసరింతుమా?

గౌతముఁడు : మనది తప్పుత్రోవయని వారందురు. అప్పుడేమి చెప్పవలయును?

వేనుఁడు : వారట్లనుటకు వీలులేదు. నేను రాజునుగదా! వారు నేను చెప్పినట్లే వినవలయును.

గౌతముఁడు : ఎవరి యిష్టమువచ్చినట్లు వా రూహింతురు. కాదనుటకు మన మెవ్వరము?

వేనుఁడు : ఎవ్వరము! నేను రాజును. ప్రజలు సరియైన మార్గమున నడువఁజూచుట నాకు విధి.

గౌతముఁడు : నీవు రాజువైన పైని భగవంతుఁ డున్నాఁడు. భగవంతుఁడైన విష్ణువు నెక్కువగాఁ జూతురా మానవులు? వారలలో నొకఁడైన రాజు నెక్కువగాఁ జూతురా మానవులు?

వేనుఁడు : అబ్బా! ఆనుపూర్విగా వచ్చు భావములు కొన్ని మనలను బిశాచములవలెఁ బట్టుకొన్నవి. అవి వదలునట్లు లేవు. మానవలోకమును బంధించివేయు కొన్ని దుర్మార్గపు టూహాలు, పాడుస్మృతికర్తలవలనను పురాణ కర్తలైన గడ్డపువారివలనను మనలోఁ బాతుకొనిపోయినవి. అవి వదలినఁగాని మనము బాగుపడము. మానవజాతికి మోక్షము లేదు. ఈ భగవంతుఁడన్న యూహ యేనాఁడు నాటఁబడినదో?

గౌతముఁడు : భగవంతుఁడే లేఁడా!

వేనుఁడు : ఉన్నాఁడా!

గౌతముఁడు : ఉన్నాఁడు.

వేనుఁడు : ఎట్లు?

గౌతముఁడు : ఈ ప్రపంచము కార్యము. దీనికతఁడు కారణము.

వేనుఁడు : ఈ ప్రపంచమే నిత్యము. ఇదియే అన్నిటికిఁ గారణము.

గౌతముఁడు : ఇది అస్థిరముగాన నిత్యముకాదు. అందు కస కారణమును గాదు.

వేనుఁడు : అట్లయిన నీవు చెప్పు భగవంతునకు వేరేకారణ ముండవచ్చు.

గౌతముఁడు : లేదు. అట్లు కారణమునకుఁ గారణముగా నంతు లేకుండపోవును. దాని ననవస్థాదోషమందురు తార్కికులు.

వేనుఁడు : ఆ దోషము తార్కికులతోఁ జెప్పుము.

ఆ తలుపుదగ్గర నట్లెంతసేపు నిలుచుందువు ? నాలుగు నాళ్ళనుండి యెక్కడకుఁ బోతివి ? ఇట్లు రా !

గౌతముఁడు : [వచ్చి] ఊఁ !

వేనుఁడు : [ముద్దిడుకొనును]

గౌతముఁడు : కోరికతీర ముద్దిడుకొనుము.

వేనుఁడు : ఏమంత దయ !

గౌతముఁడు : ఇది మన చెలిమికి తుదిచీటి.

వేనుఁడు : ఏ మట్లనెదవు ?

గౌతముఁడు : పదిమాట లెందుకు? ఈనాఁటితో నీ నా మైత్రి అంతమైనది. నీబుద్ధి విపరీతపుఁ ద్రోవలు పోవుచున్నది. నా బుద్ధి సనాతనధర్మము నాశ్రయించుచున్నది. నీ కేమొ యజ్ఞము లక్కఱలేదు; స్వాధ్యాయము లక్కఱలేదు, స్మృతు లక్కఱలేదు, నా కవన్నియుఁ గావలయును.

నీ యీ విపరీతసిద్ధాంతములవలన లోక మంతయు సంక్షోభించిపోవుచున్నది.

జన్నింపుఁబొగలచే మిన్ను కప్పుటలేదు ఒకవానయును కురియుటయు లేదు
తొలికోడికూఁతతోఁ దలమునుకలిడుటలేదు నునులేఁత పైరు పండుటయు లేదు
తఱితోన నాల్గువేదములు మ్రోల్చుటలేదు కొసకఱ్ఱి నేల సాగుటయు లేదు
౧ అగ్గి నావులనేయి హవిసు వ్రేల్చుటలేదు కూడునెగ్గులు తొలఁగుటయు లేదు

పొలము దున్నుటకై కాపు పోయినంత
జడ్డిగంబున మిఱుత పోటాడుచుండె
పాలుసాల్ చిత్త చిత్తగించదును ఱేఁడ!
స్వాతి సాగించదును నీప్రసాద మేమొ?

ఓహో! నీమూలమున బ్రాహ్మణులకు మెడలలో జందెములు, ఇండ్లలో మూఁడగ్నులు, మొగములలో తేజస్సులు, తట్టలలో ధాన్యములు సిందుకున్నవి. నీవిపరీత సిద్ధాంతములు వ్యాపించుటచేత సురాహారులైన దేవతలు జార్చు బాష్పములుగూడ మధ్యేమార్గమున సూర్యుని వేడికిఁ దపతపలాడి యావిరి యయిపోయి వర్షాభ్రాంతి కూడ లేకుండఁజేయుచున్నవి.

వేనుఁడు : నాయనా ! గౌతమ ! ఇది యేమిటోయి ! ప్రాత స్సమయవికసిత నవనీరేజసదృశములై వెన్నెలవలెఁ జల్లనైన నీకన్నులు నిప్పులు గ్రక్కుచున్న వేల ? లీలాబిస కాండములఁ బోలిన నీ చేతు లినుపగుదియలవలెఁ దిరుగుచున్న వేల? వసంతకోకిల గొంతువోలె సన్ననై మధురమైన నీకంఠము శ్రవణకఠోర మగుచున్న దేల ?

చిన్ననాఁటినుండి మనయాత్మలు ఒకచోట నుంచిన రెండు పూవులవాసనలవలె గలసిపోయినవి. ఆ రెండు వాసనలను విడఁదీసిన ప్రజ్ఞాశాలి యెవఁడోయి ! తమ్ముఁడా ! ఒక్కసారి నన్నుఁ గౌఁగిలించుకొనుము.

గౌతముఁడు : ఇట్టి యనునయములచేత, నిట్టిప్రేమ ప్రకటనలచేత మరల నాతలఁపులు నీవువశపరచుకొనలేవు. ఇన్నాళ్ళంధుఁడనై నీ సిద్ధాంతములు నిజములని నమ్మితిని. ఆర్యఋషులు వ్రాసిన వ్రాఁతలు నీవు చదువలేదు. నను జదువనీయలేదు. పైఁగ వారి యూహ లన్నియు తప్పులందువు.

తతిబహుజన్మలబ్ధసుకృతంబుల ప్రోవులు, యోగనిష్ఠ ను
గ్రతపము రూపుగొన్న స్మృతికర్తలు మూర్ఖులు; నీ వొకండు పం
డితుఁడవు, వారివాదములు నిల్వవు; నేలకు ఱేఁడవైన నీ
జతనము మాకు నెల్ల శిరసా పరిధార్యము వేనభూమిపా!

వేనుఁడు : [కోపము]

గౌతముఁడు : నీకుఁ గోపము వచ్చిన నాకు భయము లేదు. పారాశరికివలె, భార్గవునికివలె, శౌనకసునకివలె నీ నన్న

నాకు భయము లేదు. లోకము నీ యూహల ప్రకారము నడచెనేని ప్రళయము రేపే వచ్చును. లోకకంటకములైన యీ యూహలతో, నీ యీ సిద్ధాంతములతో జగమ్మెల్ల సంక్షోభించి పోవుచున్నది.

నీ కంతగాఁ గోపము వచ్చిన మల్లెపువ్వులన్న నా చేతులు తెగనరకుము. నందివర్ధనపువ్వులన్న నా కన్నులు చిదిమి వేయుము. తెల్లతమ్మిమొగ్గయన్న నా కుత్తుక కురివెట్టుము. కాని నీ పూర్వపుభావముల కే నొప్పను. నేను బ్రతికి యున్నంతవఱకు నీ సిద్ధాంతములను ఛిన్నభిన్నములు చేసి ప్రజలలో విప్లవము కలిగించెదను.

వేనుఁడు : నీవు చేయుచున్నది రాజద్రోహము.

గౌతముఁడు : నీవు చేయుచున్నది ప్రజాద్రోహము.

వేనుఁడు : ప్రజ దేహము, రాజాత్మ; దేహ మాత్మయొద్దిక లోనిది.

గౌతముఁడు: మరల నా రాజే దేహము. నారాయణుఁ డాత్మ.

వేనుఁడు : గౌతముఁడా! నిన్ను నాశనము చేసెదను.

గౌతముఁడు: ఓహో! నీవు వేనుఁడవేనా! నీవు వేనుఁడవేనా!

[వెనుకవెనుకకుఁ బోయి నిష్క్రమించును]

[తెరలో]

ఆకసము రెండుబారల, పైకిఁ జనెఁ దమ్మిసొగసు పడఁతిమగఁడు పూరే
కుల మివులు తుషారస,మీకరణముకూడ వేడిమికి తారెను పో.

'ఓసి పురాతనక్షితిభృదుగ్ర మహావ్రతశాలి! లేచి రా
వే సకిణప్రకోష్ఠకనివిష్టధనుర్గుణకేలి! ప్రాప్త పూ
జాసముపస్రవన్మధురసప్రసవావలిమేలుముల్ ప్రశం
సా సముదాళిరాజిపరిషత్తులు తీర్చ వినిర్ణయించెడిన్.

వేనుఁడు : ఓరీ! కౌషీతకా, కౌషీతక! ఏమిరా తిరుగుఁబాటు. గౌతమునితిరుగుబాటునరే! క్షుద్రనందికూడనా ?

కౌషీతకుఁడు : [ప్రవేశించి] వేనుఁడా! క్షమించుము, క్షమించుము. ఇతఁ డెవఁడో కుద్రనంది. ఆర్యవినీతభట్టుని కూఁతురుబిడ్డఁట. రాజధానికి దూరపుఁబల్లెటూరిలో కులవిద్యలో నారితేరి తాతగారిని జూడవచ్చి ఆయన యెరుకలేక విద్యాప్రకాశనలోభమున వచ్చినాఁడు.

[కుద్రనందివైపు]

అయ్యా! కుద్రనంది! వేనుని యనుగ్రహము సంపాదించుము. ఇటు రమ్ము

కుద్రనంది : [ప్రవేశించి] జయముజయము వేనధరాధిపులకు!

వేనుఁడు : వీఁ డేమొ యడవిలోని మృగమువలె నున్నాఁడు. ఓరీ! దుర్మార్గుఁడా! నాయెదుటనే నాయాజ్ఞోల్లంఘనము చేసెదవురా! కౌషీతకా! నేఁడు రెండుజాములలోపల వీని తలకు వీనిమొండెమునకు·నేమి సంబంధము!

కుద్రనంది : [ఏడ్చుచు] ప్రభూ! నావలనఁ దప్పేమి ?

వేనుఁడు : ఓరీ! పసిపశువా! నీతల్లి చనుఁబా లింకను నీపెద

వులమీఁద నారలేదు. చండమార్తాండుఁడైన వేనునితో నాటలా నీకు ?

కుత్రవంది : అయ్యయ్యో ! నాకేమియుఁ దెలియుటలేదు.

వేనుఁడు : ఓసీ! నిన్నుఁ బంపించిన ఋషులను బోయి కనుఁ గొనుము, తెలియును. కోపీతకా! వీని నిటనుండి లాగి వేయుము.

[కోపీతకుఁడు కుత్రవందిని బలవంతముగఁ దీసికొనిపోవును]

వేనుఁడు : వాఁడు చదివిన పద్యములలోని యర్థము బాగుగనే యున్నది. ఉత్తేజితమైన ప్రకృతినుండి రాఁదగిన కవిత్వముగూడ కులక్రమాగతవిద్య యైనదే. ఆహా! దివ్యమైన మానుషశక్తుల నన్నిఁటిని కులవిద్య లను సన్నని కృత్రిమపుబోదెలలో నొదిగించినారు !

పృథువు : [ప్రవేశించి] అన్నా కాదు – వేనుఁడా !

వేనుఁడు : ఏమి పృథూ! మఱల నీమేనఁ బూవులు లేవు. నీ చేతిలోఁ దామరపూవు లేదు. ముంగురులలో మొల్లల మొగ్గలు లేవు. చెవిలో దిరిసెనపూవు లేదు. తలలో మందారములేదు, మెడలో గోరంటపూవులు లేవు. ముంజేతుల దండల మల్లెలు లేవు. పూవులచేత నలంకరింపఁబడని నీ సొగసు నేను చూడను. [కనులు మూసికొనును]

పృథువు : తోఁటలో నొక్కపూవైనను లేకుండఁ గోసివేయఁ బడినవి.

వేనుఁడు : ఎవరు కోసిరి ?

పృథువు : అంగరాజా పూలనన్నిటినిఁ గోసి తన యొడలెల్ల నలంకరించుకొనిపోయె నఁట.

వేనుఁడు : ఆ పిచ్చివానికి మఱలఁ దలుపు లెవరు తీసిరి ?

పృథువు : కోటతలుపులు వానియంతట నవియే యాయనకేక వినఁబడినంతనే తెరచుకొనుచుండె నఁట.

వేనుఁడు : నీ కీ కథ యెవరు చెప్పిరి ?

పృథువు : సునీథ చెప్పినది.

వేనుఁడు : సునీథ పిచ్చిది.

పృథువు : అంగరాజు పిచ్చివాఁడుకాఁడా ?

వేనుఁడు : అంగరాజుపిచ్చి వేఱు, సునీథపిచ్చి వేఱు.

పృథువు : అంగరాజు రాత్రులందు వచ్చుట యేల ?

వేనుఁడు : రాజు రాత్రులందే కదా వచ్చును ?

పృథువు : అంగరాజునకుఁ బిచ్చి యెందు కెత్తినది ?

వేనుఁడు : అంగరాజున కా పిచ్చి పుట్టుకతోనే యున్నది.

పృథువు : ఆయన కొన్నాళ్ళు రాజ్యము చేసె నఁటకదా ?

వేనుఁడు : ఆ పిచ్చితోనే రాజ్యము చేసెను.

పృథువు : జను లాయనరాజ్యము పొగడుచుందురే ?

వేనుఁడు : ఈ జను లందరు పిచ్చివారు గనుక.

పృథువు : అంగరాజు కోయని మందారపుష్ప మొక్కటి యున్నది.

వేనుడు : అది తెచ్చుకొనకపోతివా ?

పృథువు : ఆపూవును నేను కోయఁబోగా నది నన్ను కోయ వద్దన్నది. పూవు మాటాడుట యేమి టని నా కాశ్చర్య మైనది. అయినను నాధ్వని యెవరైనఁ బురుషులు దగ్గరలో నుండి కలిగించిరేమోయని యటునిటు చూచితిని. కాని యెవరులేరు. ఇంతలో మఱల పూవన్నది: 'నేనే మాట్లాడి తిని. ఎందు కంత దిగ్భ్రాంతిపొందెదవు?' అని. 'పూవా! నీ వెట్లు మాట్లాడఁగలిగితివి' అని నే నడిగితిని. అది సమా ధానము చెప్పలేదు. మరలఁ గోయఁబోఁగా నది యొక పాటపాడినది. ఆపాటలోని యర్థ మిది. నే నిదివఱకే తెగఁ గొట్టఁబడిన రాజుతలకాయవలె నెత్తురులో మునిఁగి తేలు చున్నాను. ఇంకను న న్నేల త్రుంచెదవు అని.

వేనుడు : పృథూ ! నీకుఁగూడ పిచ్చియెక్కినది.

పృథువు : ఇంకఁ బిచ్చి యెక్కినవాఁడవు నీ వొక్కఁడవు. ఆ తోఁటలోని మందారసుమమువలె నీవొక్కఁడవుమిగిలినావు

వినీతభట్టు : [ప్రవేశించి] వేనుఁడా ! నామనుమఁడు కుర్ర వందికి ఆచారము తెలియదు. పిచ్చిరాజు కాలములోని యాచారములే నడచుచున్న వనుకొనివచ్చినాఁడు. వానిని బుషులెవ్వరు పంపలేదు. దయయుంచి వానితల నిలుపుము.

వేనుఁడు : పృథూ ! అంగరాజును నీవు చూచితివా ?

పృథువు : నేను చూడలేదు. శ్లథాంగుడు చూచెనఁట. తలయంతయు చీకిరిబాకిరిగా నున్నదఁట. శ్మశానములోని పునుకలు పేరుగాఁ గుచ్చి మెడలో వేసికొనెనఁట. కాళ్లకుఁ జేతులకు బొమికలుకట్టుకొనెనఁట. మొగమునిండ బూడియ రాచుకొని చింపిరిగుడ్డలతోఁ గనంబడె నఁట. వానికి భయమువేసిన దఁట.

వేనుఁడు : వాడు శ్లథాంగుఁడుకాఁడు. శ్లథబుద్ధి.

వినీతభట్టు : వేనుఁడా! నీవు రాజ్యమునకు వచ్చినది మొదలు నే నొక్కసారియైనఁ గైవారము సేయలేదుకదా? నీవు చెప్పిన సిద్ధాంతములే నే నాచరించుచుంటినిగదా, సుఖములోఁ గష్టములో నీతో ముడివెట్టుకొంటినికదా, మహానందము మరగించిన కవితాసక్తికి నీళ్లువదలుకొంటినికదా, కడుపులోఁ జల్లకదలని నాపూర్వులుచేయు సువృత్తి పరిత్యజించి బడుగునైతినికదా, నాకూఁతునకు వాఁడొక్కఁడు కొడుకు మందార సుమమువంటివాఁడు. వానిమెడ యేల నులిమెదవు?

వేనుఁడు : పృథూ ! ముసలిరాజును నేనును జూచితిని. రాతిరి నేను సౌధబహిరంగణమునఁ జల్లనిగాలికై తిరుగులాడుచుండగాఁ దోఁటలో నెవరో తిరుగుచున్నట్లు తోఁచి యచటికిఁబోతిని. అచట నున్నది అంగరాజు. పూవులు కోయుచున్నాఁడు. అతనిమెడలెల్ల బొమికలు కాదు,

పూవులు. మెడలోనివి పునుకలుకావు, పెద్దపూగుత్తులు. మొగమునఁ బూసికొన్నది బూడిదకాదు, పూవులకుమ్మ. కాని పృథూ! ఏపూవులు నీవు ధరించిన నీవు త్రిలోక సుందరివలె నుందువో ఆ పూవు లతఁడు ధరించినఁ బెద్ద వికారభూతమువలె నున్నాఁడు.

పృథువు : నీ వాతనిఁ బూవులు కోయవద్దని యడ్డగింపలేదా?

వినీతభట్టు : ఓయి! వేనుఁడా! ముసలితనమున నా ప్రేగు నెందుకు కోసెదవు. కలకలలాడు మొగముతోడి మహా లక్ష్మి నాకన్నకూఁతురు వానితల్లి నిండుచందురునిబోలు మొగమున నమంగళబాష్పము లేలకురిపింతువు? పది యావులఁగట్టివేసిన చావడివలెఁ గలకలలాడు నాగృహము నేల దుఃఖభారముచేత వెల వెలఁబోవునట్లు చేసెదవు? ఇంకొకజన్మమున నీకడుపునఁ బుట్టెదను, వేనుఁడా! పసి వాని యీ చిన్నతప్పిదము మన్నింపుము.

వేనుఁడు : పృథూ! ఆమందారమున నెన్ని రేకు లున్నవి?

పృథు : పది రేకు లున్నవి.

వేనుఁడు : మన మొక్కొక్క రేకుచొప్పునఁ ద్రుంచుచు వచ్చిన నెన్ని రేకులు త్రుంచినతరువాత నాపూవు లేకుండఁబోవును?

వినీతభట్టు : అయ్యో! వేనుఁడా! సూర్యుఁడు గగనసౌధమున నడిమిగదికి వచ్చుచున్నాఁడు. ఆ పసివాఁడు పోయినతరు వాత నీ ముసలివాఁడు బ్రదుకఁడు. నా యొడలిలోని

నెత్తురు కండలు నరములు మాంసము నంతయు నుడికిపోవు చున్నది. నేనింక బ్రదుకను. రెండుజాము లయినంతనే నామనుమనిస్మృతి వినవచ్చినంతనే నా ప్రాణము లిందే వదలుదును. ఒక ముసలిప్రాణము నొక పసిప్రాణము నొక్కసారిగా నేల తీసెదవు ?

వేనుఁడు : పృథూ ! పూవు తుంచినతరువాతఁ బూవు కొంత సేపటికి వాడిపోవునుగదా ! అది యెందుచేత !

పృథువు : ప్రాణము పోయినతరువాత దేహము కొంతసేపటికి చీమలుపట్టునుగదా ! అది యెందుచేత ?

వినీతభట్టు : వేనుఁడా ! రెండుజాములైనది. మొగసాలలో గంటలు కొట్టుచున్నారు. నాయాశయుఁ బ్రాణములు నొకేసారి నాగొంతులో నిలిచిపోవునాయేమి ?

[తెరలో]

కుబ్రవంది నెత్తురుచేత మాధ్యాహ్నికసంధ్యకుఁగూడ నెట్టఁ దనము వచ్చినది

వినీతభట్టు . [పడిపోవును]

వేనుఁడు : పృథూ ! నీ వా మందారపుష్పము తలకుఁ బెట్టు కొనుము.

పృథువు : వేనా! నీ వీ కుబ్రవందితల మెలకుఁ గట్టుకొనుము.

[తెర]

# రెండవ యంకము

రాజాంతఃపురము – వేనుఁడు గౌతముఁడు ఇద్దరు రెండుద్వారములవద్ద

వేనుఁడు: గౌతమా! తిక్క తిరిగినదాయేమి? మరల వచ్చితివి.

గౌతముఁడు: తిక్క నిన్ను వదలిపెట్టినప్పుడే తిరిగినది. ఇప్పుడు వచ్చిన దందుకుకాదు. ఎందుకో చెప్పెదను.

మొట్టమొదట నామీఁద నీకు స్నేహమేమైన మిగిలి యున్నచో నది మొదలంట నాశముచేయుము.

వేనుఁడు: ఆపని నాచేతఁగాదు. నీకనులలో నాయంద మున్నంతవరకు నే నది చేయలేను. తుమ్మెదలు బారుగా నంచులఁ గూర్చున్న తామరపూవులవంటి నీ ఆ కనులు నాకిచ్చివేయుము. నీమీఁద నాకుఁ గల స్నేహము నీ కిచ్చివేసెదను.

గౌతముఁడు: నీ వేమొ సౌందర్యపిపాసివలె కనిపించెదవు కాని నీకు నిజమైనసౌందర్యజ్ఞానమే లేదు. మానిసి సౌందర్యము కన్నులలోఁ జేతులలో మొగములో నుండదు. అతని యాత్మలో నుండును. పూవులయందము దాని రెక్కలలో దానియాకృతిలో దానివాసనలో నుండదు. దానిసృష్టిలో నుండును. నీవంటి మిథ్యాసౌందర్యవాదులు పైమెరుపులు చూచి భ్రమసిపోదురు.

వేనుఁడు : సౌందర్యము నేత్రములచేతఁ దెలిసికొనఁదగినది. అందుచేత నీవాదము తప్పు.

గౌతముఁడు : కాదుకాదు. అది మనస్సుచేతఁ దెలిసికొనఁ దగినది. అందుచేత నావాదమే మంచిది.

వేనుఁడు : అయినచో నామనస్సు నా కన్ను చూచినదాని నొప్పుకొనుచున్నది.

గౌతముఁడు : వేనా ! అట్లుకాదు. నీమనస్సు నీకంటె కఠినమై పోయినది. మనస్సును వివేకవంతము చేసికొని కంటెని మనస్సు చెప్పినట్లు వినిపించుము.

వేనుఁడు : తమ్ముఁడా ! ఈ వేదాంత మెచట నేర్చితివి ? ఇటు రమ్ము. తల అట్లు చేయించితివేమి?

గౌతముఁడు : మ్లేచ్ఛులవలె నిన్నుఁ జూచి పెంచిన జుట్టు తీయించి గోష్పాదమంత యుంచితిని.

వేనుఁడు: మాడుపట్టున జుట్టున్నచో నది శిరసును రక్షించును.

గౌతముఁడు : ముడికిరాని కేశములు శిరస్సున నుండరాదు. వానినుండి యోగశక్తి మనకుఁ దెలియకుండఁబోవును.

వేనుఁడు : యోగ మనఁగా నేమి ?

గౌతముఁడు : జీవాత్మపరమాత్మతో సంధించుటకుఁ జేయు సాధన.

వేనుఁడు : అయినచో నది పరమాత్మ యొప్పుకొనిన సాధనయా, లేక ఒప్పుకోనిదా ?

గౌతముఁడు : నీ మాట నా కర్థముకాలేదు.

వేనుఁడు : ఆ పరమాత్మను నేను. లోకమంతయు జీవాత్మ. రాజు పరమాత్మ. కావున నన్నుఁ బొందుటకు నీ కా సాధనయే యక్కఱలేదు.

గౌతముఁడు : ఓయీ ! నీకు ఋషుల మహత్త్వ మింకను దెలియలేదు.

ఒకఁడుకోపించి పెంకెకుఁ బెంకెయై లోక మెద్రిచిన నహుషుని విద్రిచినాడు
ఒకఁడు నిశ్చలుడై మహామూర్తి తనదైన యోగయష్టికి సరితూగినాడు
ఒకఁడు ముక్కంటి సాటికి తిరస్కృతి హాసస్మృతి కొలఁగన్ను కన్పరచినాడు
ఒకఁడు విప్పినకంటిసెకలయుంచులను దుర్మతిసాగరుల సంఖ్య మాడ్చినాడు

వారనఁగ నేమి యని? తప్పివచ్చెనేని
ఒక్కయెడఁ ద్రిమూర్తులకైన దిక్కులేదు;
ఆముదపుగింజ నింకొక యాముదంపు
గింజతో నొక్కినట్లు నొక్కుదరునుమ్ము!

వేనుఁడు : గౌతమా ! ఆ కోపమంతయు నెవరిమీఁద ?

గౌతముఁడు : ఎవడు పురాఋషుల మహాదివ్య మార్గములందు గాళ్ళుతగిలిన గొడ్లు పొలిమేరలు త్రొక్కినట్లు త్రొక్కుచున్నాడో వానిమీద.

వేనుఁడు : వాడు నే ననియా నీ యూహ?

గౌతముఁడు : అవును, నీవనియే నా యూహ ! నీ వొకటిచేసి యొకటి చేయలేదా? నిత్యమై మహాదివ్యమైన మతమును నాశనము చేసితివి. ఏయాచారములు దేశమునందు నిలిచి యుండినచోఁ బేదమొదలు ధనవంతునివరకు సుఖముగా బ్రదుకుదురో ఆ యాచారములు మూలమట్టుగాఁ జెల్లగించితివి. వేదములు పౌరుషేయము లంటివి. వీనికి సంప్రదాయ సిద్ధములైన మాయర్థములు కావని నీవు క్రొత్త యర్థములు చెప్పించితివి. నీ మూలమున వేదములు వేదాంగములు మూలఁబడినవి. కృతకవిద్యలు బయలుదేరినవి. అట్లు కాదన్నవారిని నీయనుయాయులచేత వెనుకనుండి గేలి కొట్టించుచుంటివి. నీవుచేసిన దింతయని చెప్పటకున్నదా? ఇదిగో నీవింతచేసితివి. ఈ కోపమంతయు నీ మీఁదనే? తెలిసినదా?

వేనుఁడు: తెలిసినది. కాని ఋషుల మార్గమందు నే నెందులకు నడువవలయును. ఆఋషులకువలె నాకుమాత్రము శరీరావయవములు లేవా? వారికివలె నాకు మనస్సు లేదా? వారివలె నే నూహింపలేనా? నా యూహను మనస్సును నన్నుఁ గాదని యెవరినో నే నేల యనుసరించవలయును. నా యంతరాత్మ చెప్పినట్లు నేను నడచుకొందును. నేను రాజుగాన నా ప్రజలచే నట్లు నడిపింతును.

గౌతముఁడు : నీయంతరాత్మకు ఋషుల యంతరాత్మకు భేదమున్నది. వారి యంతరాత్మ తపస్సుచే యోగాగ్నిచేఁ

దప్తమై శరీరవాంఛలను దాఁటి యింద్రియాతీతమైన జ్ఞానమును గడించుకొన్నది. వారియంతరాత్మ యాథార్థ్యమునే చూడఁగలుగును. అపరిపక్వమై యింద్రియవశమైన నీ మనస్సు నీకంతరాత్మ భ్రాంతికల్పించి నిన్ను దుష్టపథముల నడిపించు చున్నది. ఓహోయి! వేనరాజా! అంతరాత్మ యంతరాత్మ యనెదవు. ఎవరియంతరాత్మ పరికారము వారుగా సర్వమానవులు చరింతురేని నీ రాజత్వము నేఁటితోలేదు. సర్వజంతువులు చరించునేని మనుజుని యెక్కువయేమి? అట్లయినచోఁ గుమారులు తండ్రుల మాటలు విని చదువరు. ప్రజలు రాజుమాట వినరు. ఎవరిత్రోవ వారిది. లోకమునందు మిగులునది సర్వనాశనము. కాదు, నేను రాజును. నామాట యందరు వినవలెనందువు. రాజనగా నేమి? అతనికి సైన్యము లున్నవి. విననివానినిఁ జంపెద నను. ఎక్కువ సైన్య ముండుట వివేకమా? లోకమును బాలించునది పశుబలముచేతనా? ఆత్మబలముచేతనా? పశుబలమన్నచో లోకమున నొకనియతిలేదు. దుర్బలునకు రక్ష లేదు. ఆత్మబల మన్నచో నందఱకు రక్షయున్నది. అప్పుడు నీ మార్గమునకన్న ఋషులమార్గము సమాదరణీయ మగుచున్నది.

వేనుఁడు: నాయంతరాత్మ యంతరాత్మ కాదనుచున్నావు.

గౌతముఁడు: అది యింద్రియాధీనమైన మనస్సునం దంతరాత్మభ్రాంతి.

వేనుఁడు : సరే! గెలిచితివి. ఇంక నీఋషులవద్దకు నడువుము.

గౌతముఁడు : [ఆలోచించి] నాకన్ను లక్కఱలేదా ?

వేనుఁడు : [ఆఁగి] తమ్ముఁడా! ఇంక మనమిద్దరము విరోధము లేకుండ నుందము. నిన్న నీవు వెళ్ళిపోయిన తరువాత నేను నీకై యెంత దుఃఖించితిని? తెల్లవారలు నాకు నిదుర లేదు. మనస్సుసరిగా లేదు. మఱల నీ వీ నాఁడు కనంబడినంతనే పంటిబిగువున కింతసేపు వాదించితిని గాని నిన్నువదలి నే నుండలేను. తమ్ముఁడా! రమ్ము! రమ్ము! వేసంగిలో నెండి కొండలోయలలో దమ్ముకొన్న · చెట్లనీడలందు పడెలు కట్టిన చిన్న సెలయేటి నీటివలె చల్లనైన నీచేతులు నా మెడకుఁ దగిలించుము. ప్రేమలోఁతు లెదదాక నెఱిఁగి యున్న ప్రియురాలి నిశ్చలదృక్కులవలె సూదులతోఁ బొడుచుచున్న నీచూపులు నాచూపులతో మేళవించుము. తెల్లవారు వరకు రేకలు బిగిసిన యాకాశమల్లివలె, కాపు సొగసుకాని కదలని చెవిజంపువోలె నిడివియై తుద విరిసి సొగసులొలుకు నీనాసాగ్రంబున వెడలు కమ్మని నిశ్వాసములు నామెడమీఁదఁ బూలమాల కదలినట్లు కదలనిమ్ము.

గౌతముఁడు : ఆగు మాగుము.

వేనుఁడు : ఎందుకు ?

గౌతముఁడు : నీవంటి కృత్రిమ స్నేహితుని నే నింతవరకు ఎఱుఁగను.

వేనుఁడు : [కోపముతో] ఎందుచేత ?

గౌతముఁడు : స్నేహితుఁడైనవాఁడు తన మిత్రునివద్ద నేదియు దాచరాదుగదా? నిన్న నీవు నాయందుఁ జూపించిన ప్రళయాగ్నివంటికోపము నానుండి యిన్నాళ్ళు దాచితివి. నీ వేమి స్నేహితుఁడవు ?

వేనుఁడు : గౌతమా! కోపము శత్రువులయందుఁ జూపించునది.

గౌతముఁడు : నాయం దది చూపఁబడినదిగాన నేను నీకు శత్రువను.

వేనుఁడు : ఓయీ ! అది తాత్కాలికము.

గౌతముఁడు : కాదు, అది సత్యము. నీకడకు నే నింక రాను. వచ్చినను బద్ధవిరోధి నని నమ్ముము. నీవు నిన్నఁ జూపించిన కోపమునకుఁ బది రెట్లెక్కువ చూపించుము. నే నది యిప్పుడాగఁ గల్గుదును. దీనితో నీవో నేనో తేలవలయును. నీవు సనాతనధర్మమతావలంబివైనఁ గావలయును. నేను నీ కఱకుకత్తికి నెరయైనఁ గావలయును.

ఇదిగో? యీ నాచేయి చూచితివా? ఇది

అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లాత్తగంధూషితత్రయు లౌర్వవహ్ని
గర్భితాంతస్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వఁడు విరోధి తద్వధ కెత్తినయది

వేనుఁడు : ఓసీ ! గౌతముఁడా ! నీతల తెగిపోయినది.

గౌతముఁడు : వేనా ! విజృంభించుము. విజృంభించుము. ఎఱ్ఱవడి నిప్పులవలెనున్న నీకన్నులలో నిదిగో చూచుచుంటిని. నాకు భీతికొలుపుట లేదు చూచితివా ?

వేనుఁడు : కౌషీతకా ! కౌషీతక !

గౌతముఁడు : రాజా! నే నిదిగో పోవుచుంటిని ? కౌషీతకుని నావెనుకఁ బంపుము. వాఁడు నన్ను బంధించఁగలఁడు.

[నిష్క్రమించును]

కౌషీతకుఁడు : [ప్రవేశించి] వేనుఁడా! ఏమి ?

వేనుఁడు : ఏమియును లేదు.

కౌషీతకుఁడు : సరే !

వేనుఁడు : సునీథను నేను రమ్మంటి నని చెప్పుము.

కౌషీతకుఁడు : [నిష్క్రమించును]

వేనుఁడు : లోకమంతయుఁ దిరుగుబాటుచేసినను వారి నణఁచఁగలను గాని గౌతము నణఁచుట యెట్లు? చిన్న నతఁడు నా కోపమున కాఁగలేకపోయినప్పుడు నేను వాని గెలిచితి నను కొంటిని. నేఁ డతఁడే నా కోపమును గెలిచెను.

మతావేశ మనఁగ నిది. మతావేశములో నున్న మనుజు లేదైనను జేయుదురు.

పృథువు : [ప్రవేశించి] వేనా ? ఎందుకు సునీథకై కబురంపితివి ?

వేనుఁడు : నీవు సునీథవా !

పృథువు : నే నేమి! నీవుకూడ సునీథవే. మన మిద్దర మామె ప్రేగునుండి వచ్చినవారమేకదా! జన్యజనక పదార్థములకు తత్త్వతః భేదము లేదు.

వేనుఁడు : పిచ్చిమాటలు మాటాడకుము. నాకుఁ గోపముగా నున్నది.

పృథువు : నిన్నుఁ గుర్రవందిసి జంపించితి వని నాకును గోపముగా నున్నది.

వేనుఁడు : నీవు వానిని ప్రేమించితివా ?

పృథువు : సునీథ రాత్రి యంగరాజువెంటఁ బడిపోయినది.

వేనుఁడు : ఇంక వారిద్దఱకుఁ గోటతలుపులు తీయరాదు.

పృథువు : తలుపు లవే తెఱచుకొనుచున్నవి.

వేనుఁడు : నే నది నమ్మను. వారి నెవరు చూచినను వెంటనే నావద్దకుఁ దీసికొని రావలయును.

పృథువు : మొన్నరాత్రి నీవే చూచితివికదా! వదలిపెట్టితి వేమి ?

వేనుఁడు : నేఁడు నీ యొడలినిండ నిన్నిపూవు లెక్కడివి?

పృథువు : అంగరాజు సునీథను దీసికొని పూవులు వదలిపెట్టి పోయెను.

వేనుఁడు : ఇంక సునీథాంగరాజులు నాయింటికి రాఁగూడదు.

పృథువు : వచ్చినచో నేమి చేసెదవు ?

[అంగరాజు ప్రవేశించి]

అంగరాజు : ఏమిచేయునా, కన్నులు పెట్టుకొని చూచును. మా మాటలు చెవులు పెట్టుకొని వినును. అంతకన్న నేమి చేయును? ఏమి చేయఁగలఁడు? ఇతఁ డేమి రాజా ! రాజును నేను. సునీథరాణి. పెండ్లి చేసికొనసవానికి రాజ్యార్హత లేదు. ఈసంగతి నేనేకాదు, సర్వఋషులచేతఁ జెప్పించెదను. ఇదివఱ కెంతమంది రాజులు రాజ్యము చేయలేదు! ఎవరి మాటయో యెందుకు ? ఈ అంగరాజు రాజ్యము చేయ లేదా? అతనికి భార్యలేదా ? ఇదిగో సునీథ. సునీథా ! మాట్లాడవేమి ? నీవంగరాజు భార్యవగుదువా, కాదా? సునీథా! మాట్లాడవేమి; నీవు వేనునితో నొకతైతివా! హా ! హా ! విచిత్రకుటుంబినీ ! కాపురము చేసినన్నాళ్ళు అంగరాజుతోఁబాటు రాజ్యముచేసి అతనితోఁబాటు రాజ్యసుఖము లన్నియు ననుభవించి యతఁడు ముసలియై పిచ్చియై యడ వుల వెంటఁ దిరుగుచున్నప్పుడు వానిని వదలిపెట్టెదవా ! ఇదా ! పతివ్రతల తోవ? భో ! భో! పంచభూతములారా! భో! భో! ఋష్యాత్మలారా! భో! భో! కులదేవతలార! చూడుఁడు ! చూడుఁడు ! ఈ పతివ్రతారత్నము, ఈకుల సతీతిలకము, ఈ మహారాణి, ఈ జంబూద్వీప వసుంధరా జనత కామినీచూడామణి, భర్త బ్రతికియుండఁగనే వానిని ద్యజించి కుమారునితోఁ జేరి యన్యాయపథమునఁ బోవునున్నది. పాలించుఁడు, పాలించుఁడు !

కృతముఁ గాఁ గలి పుట్టి మతములో వెలిపట్టి
తతపురాణఋషులసన్నుతిమార్గముల నిరా
దృతికల్గి పాపసంగతికల్గి కృతిపుణ్య
మతు లైన నారి కే మాత్రరక్షయు లేక
చెడిపోయె జగమెల్లఁ జెడిపోయె జగమెల్ల

వేనుఁడు : పృథూ! ఇచ్చట సునీథ యెచ్చట నున్నది? ఆ పిచ్చి వాని ఆగోల యేమి?

పృథువు : అతఁడు పిచ్చివాఁడేనాయె? ఈ నీప్రశ్న యేమి?

వేనుఁడు : సునీథ యితనివెంట నేగె నంటివి? ఏది సునీథ?

అంగరాజు : ఓయీ! వేనుఁడ, నావెంటవచ్చిన సునీథమాట పృథు నడిగెద వేమి? సునీథ నీకంటికిఁ గనఁబడదు. మృత్యువాసన్నమైనవాని కరుంధతీనక్షత్రమువలె, మ్లేచ్ఛభావపూరితునకు దివ్యఋషుల మహావాణివలెఁ, గుతర్కబుద్ధికి వేదాత్మవలె సునీథ నీకు నశించిపోయినది. సునీథ నీకెందుఁ గనఁబడును? గ్రుడ్డివానికి దివ్యమణి కనఁబడినదా? మూఁగవానికి శబ్దస్వరూపము గోచరించినదా? గుగ్గిలపుఁబొగ మత్తుచేఁబరవశుఁడైన వానికి నారసముబాధ తెలిసినదా?

ఆకసంబునఁ గాంతి వాకలై పరుగెత్తి
శ్రీకరాకృతి కన్న చిన్నారితొలిచుక్క
రేకెత్తి నానాదిశాకామినీముఖ
శ్రీ కపోలశ్రీలు చెలువు లొల్కినచోట
దాగియుండె సునీథ దాగియుండె సునీథ

వేనుఁడు : పృథు ! సునీథ నితఁడు చంపెనా యేమి ?

పృథువు : సునీథయే నీవును నేనునుగాన సునీథను జంపినచో నిన్నును నన్నునుఁగూడఁ జంపినట్లే.

వేనుఁడు : అంగరాజా ! సునీథను నీ వేమిచేసితివి ?

అంగరాజు : సునీథనుగూర్చి యడుగుటకు నీ వెవ్వరవు? సునీథ నాకు భార్య. దానిపై నాకు సర్వాధికారములు కలవు. లేవని శాసించు దుష్టరాజునాజ్ఞ నేను తిరస్కరించుచున్నాను. అరే! సునీథ యెవరు? నాయాత్మలో నాత్మ. నాదేహములో దేహము, నామనస్సులో మనస్సు, నాకంటిలోఁ గన్ను. ఎవఁడా దుష్టరాజు తెలివితక్కువ శాసనముచేసి సునీథను, నన్ను వేరుపరచువాఁడు. సునీథను నాకు ఋషులప్పగించిరి. నేను సునీథను మఱల వారి కప్పగించవలయును.

అగ్నిహోత్రము నాకు నందిచ్చిన సునీథ
భగ్నభ్రమువై నన్ను బోలుపు దిద్దు సునీథ
నగ్నమనస్కయై నన్నుఁ గొల్చిన సునీథ
ప్రాగ్నవోషఃపవిత్రతనూజ్జ్వలసునీథ
నీ వెవ్వ రడుగఁగా నీ వెవ్వ రడుగంగ

వేనుఁడు : పృథూ ! ఇతఁడు సునీథను జంపినట్లులేదు.

పృథువు : ఇదివరకుఁ జంపకపోయినను ఇకఁ జంపును.

వేనుఁడు : నీ వెట్లూహించితివి ?

పృథువు : అదికాకపోయిన నామెవిూఁది. యధికారము తన కంతయున్న దని యీ ఘోష యెందుకు?

అంగరాజు : పృథూ! పృథూ! ఆఁడపిల్లవలెఁ గనఁబడు చుంటివికాని, నీవే మగవాఁడవు. అదుగో! ఆ పురుషాకృతి ఆడది. ఆడమగతనములు వివేక తారతమ్యమువలనఁ గనఁ బడునుగాని, రాజులై దుష్టత్వము మూర్తికట్టినంత మాత్రమునఁ దెలియవు.

వేనుఁడు : సునీథను మనము రక్షించవలయును.

పృథువు : అంగరాజునధీనమందున్న యామెను మన మెట్లు రక్షించఁగలము!

వేనుఁడు : ఆమెను మనయధీనములోనికిఁ దెచ్చుకోవలయును.

అంగరాజు : అంగరాజునధీనము వదలి సునీథ యింకొకనియధీ నములోనికి నీకృతయుగములోరాదు. సునీథా! సునీథా! నీవు నన్ను వదలిపోయెదవా పోవు, పోవు.

అంగరాజు సునీథ అంగరాజు సునీథ
అంగరాజుకుఁ గాక అసుదె ఓపి సునీథ
వెంగలి శాసించి వేరుసేయు సునీథ
నంగరాజును, బాప హాతుఁ దొటమె నిజమ్ము!

[తెర]

## మూడవయంకము

రాజాంతఃపురమున వేనరాజు-గౌతముఁడు కూర్చుండి.

గౌతముఁడు : నీవు వేసిన ప్రశ్నయే మఱల వేసెదను. నీకుఁ దిక్కు-తిరిగినదాయేమి, నన్ను రమ్మని కబురంపితివి?

వేనుఁడు : అదియొకరీతిగాఁ దిరిగినది.

గౌతముఁడు : అది యే రీతి ?

వేనుఁడు : నేను వివాహమాడెదను.

గౌతముఁడు : వివాహమాడెదవా ? ఎబ్బె ! నీ వెందుకు వివాహమాడెదవు? నీవు వివాహమాడినచో నీ యీ లోకమంతయు నాడదా ? ఆడినచో నీ సిద్ధాంత మేమై పోవును ? పురుషు లందరు స్త్రీలమీఁద నధికారము వహించి వారి నధఃపతితలను జేయుచుండిరాయెను. పురుషులమీఁదికి స్త్రీల నెదురు తిరిగించి వారికిఁ బురుషులతో సమానములైన హక్కు-ల నిప్పించవా? ఆస్తియందు వారికి సమానభాగము కావలె. మఱి వివాహమైనచో నీ సిద్ధాంతమునకుఁ గొంతవఱకు విఘ్నము రాదా ?

వేనుఁడు : ఏకగర్భజనితులైన స్త్రీపురుషులు వివాహమాడినచో నా స్త్రీవిషయమున భేదమే రాదుకదా ?

గౌతముఁడు : ఆ ! ఆ ! ఏమంటివి ! ఏమంటివి !

ప్రళయావసానవర్షత్పుష్కలావర్తముక్తాశనిధ్వనుల్ ముసురుకొలిపి
ఆదివరాహదంష్ట్రాగ్రనిర్గమితాగ్నికీలాచ్ఛటల్ వెల్లగిల్లివచ్చి
వృత్రరక్షఃకంఠవివళనారంభవేళావజ్రధారాప్రభావ మొలసి
దుష్టశాసనదైత్యకోఃఖండనార్ధదేవీకరాశాసిదీప్తి మెరసి
సకలపూర్వర్షి దివ్యాశ్రుజనితఘన త
పఃప్రరోధాగ్ని మిణుగురుల్ బాహిరిల్లి
నిర్వ్యమద్రక్తమునఁ దడి నేలగాఁగ
నీ శిరస్సు ధరిత్రిపై నిలచు గాః!

ఇంక నీ మొగము నేను చూఁడను.

[నిష్క్రమించును]

వేనుఁడు : [నవ్వి] ఈ పసిబుద్ధులకు నేదైన నొకయూహ కలిగినను తప్పే. ఊహలు కలుగుట మనస్సునకు సహజము. దానిలో తప్పేమియులేదు. ఈ లేతబుద్ధులయిన ఋషులకీ మాత్రము తెలియదు. తెలియకయుఁ దెలిసినట్లు నటించుచున్నారు.

పృథువు : [ప్రవేశించి] అన్నా! నిజముగా నా ఋషులు నీయంత తెలివికలవారు కాదు.

వేనుఁడు : నీవు నన్ను 'అన్నా' యని పిలువరాదని చెప్పలేదా?

పృథువు : నీ గౌతముల సంభాషణ నేను విన్నాను. అందు కపియే యిట్లు పిలుచుచున్నది.

వేనుఁడు : నీవు నన్నట్లు పిలచిన నే నొప్పుకొనను.

పృథువు : నిన్నన్నాయని పిలచెడిదే నిజము. అన్నా! నీ సిద్ధాంతములకు నే నెన్నఁడు నొప్పుకొనలేదని నీకు తెలియును

గదా ! నేను మనస్సులో నొప్పుకొనకపోయినను బైకి నా విషయములందు స న్నదరించ నని వాగ్దాన మిచ్చితిని. ఆ వాగ్దానమును నేఁటినుండి యీ సంబోధించుటయం దుప సంహరించుకొంటిని.

వేనుఁడు : పృథూ! నీకును గౌతమునకుఁ బట్టిన పిచ్చిపట్టినదా యేమి ? మీ రందఱును స్వంతముగా నేల యూహించరు?

పృథువు : సమాధానము చెప్పుమందువా? చెప్పెదను. అనాది నుండియు సర్వమానవులకును మన స్సున్నదికదా? అందఱు నూహించిరి. పూర్వులు మన కవసరమైన విషయము లూహించి యవి యెట్లెట్లుండవలయునో నియమించి పోయిరి. అవి మఱల మన మూహించుటవలన మానవుని జ్ఞానమున కభివృద్ధి యేది ? సంగీతమునందు నీవు క్రొత్తగా స్వరము లేల కనిపెట్టవు ? పూర్వులు కనిపెట్టిన త్రోవనే పోయెదవేల? నీవు క్రొత్తగా నేఁడు స్వరములు కల్పించుట మొదలు పెట్టుము. నీ వింత గాయకుఁడవౌదువా? చెకు ముకిరాతికి దూదికి సంయోగమువలనఁ గాని, కొయ్యకు కొయ్యకు రాపిడివలనగాని యగ్ని పుట్టునని పూర్వులు చూపిరి. నీవు దానినే యేల యుపయోగించుకొందువు ? మఱల నేఁడో కనిపెట్టుటకుఁ గ్రొత్తగా మొదలు పెట్టుము. మొదలుపెట్టవు. సర్వసిద్ధముగా నున్న యాయగ్నినే యుప యోగించుకొనుచుంటివి. అట్లే సంఘవిషయమునఁగూడఁ బూర్వు లిది యిట్లు, ఇది యిట్లని నియమించి పోయిరి. ఆ జ్ఞానము నుపయోగించుకొని సుఖించలేక నేను మొదలు

పెట్టి యూహింతు నని వాదించెదవు. ఆయగ్ని ప్రత్యక్షోప
యోగము కలదిగాన నచ్చట నీకు వివాదములేదు. దీని
యుపయోగ మప్రత్యక్షముగాన నిచట వివాదము.

వేనుఁడు : అవును. అప్రత్యక్షమైన దానిని నేను నమ్మను.

అంగరాజు : [ప్రవేశించి] నమ్మవు, నమ్మవు. అప్రత్యక్షమైన
దానిని కాదు నమ్మనిది, నీ యిష్టములేని దానిని. నేను
వచ్చినంతనే తలుపులు వానియంతటనవి తెఱచుకొను
చుండె నన్న మాట నమ్మవు. నీవు సునీథకడుపునఁ బుట్టితి
నన్నమాట నమ్మవు. అవును నీ కది యప్రత్యక్షమైన విష
యము. నీ వెందుకు నమ్మవలయును? నీవు రాజువై రాజ్యాధి
కారివగు విషయమున నా నమ్మకముతోఁ బనిలేదు. చూచి
తివా! నీ నమ్మక మెట్టిదో? ధనవిషయములో, నధికారవిష
యములో నన్నియు నమ్మెదవు. నీతి విషయములో,
ధర్మము విషయములో నేదియు నమ్మవు. నీతిధర్మములు
కొట్టునా? తిట్టునా? వానియందు నమ్మక మున్నచో
స్వర్గము నిచ్చును. లేనిచో నరకము నిచ్చును. ఆ స్వర్గ
నరకములు మాత్రము ప్రత్యక్షములా యేమి? అవియును
లేవు. ఏదీ చెప్పుము? అసలు దేనిని నమ్మెదవు?

వేనుఁడు : కన్నులతోఁ జూచినదానిని నమ్మెదను.

అంగరాజు : అయినచో వాయువు ప్రపంచమున లేదు.

వేనుఁడు : గాలి యున్న దని మనకుఁ గనఁబడుటలేదా?

అంగరాజు : ఓహో! జనులార! రండు. రండు, గాలిని గను లతోఁ జూచుచున్న మొనగాఁడు బయలుదేరినాఁడు. ఈ విద్య మీ రీతనివద్ద నేర్చుకొనుఁడు.

వేనుఁడు : పృథూ! మనము గాలిని జూచుటలేదా ? అది మన యొడలికిఁ దాకుచున్నది, సుళ్ళు తిరుగుచున్నది, చెట్ల యాకు లల్లలాడించుచున్నది. వెదుళ్ళబోసికొని రొద చేయుచున్నది. సముద్రపుటొడ్డునఁ జిన్నచిన్న పొద లడ్డముచేసికొని పొడుగైన యిసుకతిప్పలు కోరడిగాఁ బోయుచున్నది. చిన్న చిన్న చెరువులలో బుల్లి బుల్లి కెర టములఁ గలిపించుచున్నది. నీ ముంగురులతో నాడుకొను చున్నది. గాలిని నేను చూచుచునే యున్నాను.

పృథువు : నీ వా గాలిచేయు పనులను చూచుచున్నావుగాని, యా గాలినే చూచుచున్నావా ?

వేనుఁడు : పృథూ! జన్యజనక వస్తువులకుఁ దత్త్వతః భేదము లేదు, కార్యకారణముల కున్నది కాఁబోలు.

పృథువు : లేదు, లేదు; అందుకనియే నీకును, నాకును సునీథకును భేదము లేదు.

వేనుఁడు : మొదల నేను సునీథకుఁ బుట్టితి నని బుజు వేమి ?

పృథువు : అయినచో నీకు రాజ్యమే లేదు.

అంగరాజు : పృథూ! కాదు, కాదు, రాజ్యమున్నది. సునీథకుఁ బుట్టిననే రాజ్య ముండవలయునా ? ఎట్లు తాను రా

జయ్యేనో వేనున కా సంగతి యెందులకు? వేనుఁ డిప్పుడు రాజు. అది ప్రత్యక్షమైన విషయము. అది కా దనుటకు నీ వెవ్వరవు, నే నెవ్వరను. అంతేకాదు వేనా?

వేనుఁడు : అంతే!

అంగరాజు : మొండివాఁడు రాజుకన్న బలవంతుఁడు!

[తెరలో]

సర్వభారతక్షోణీ మండలాధిపత్యచిహ్నరత్నకిరీట విభ్రాజిత శిరోమండలా! వేనమహారాజా! రెండుజాము లైనది. ధర్మాసనమునుండి లేచువేళ యయినది.

చిఱుతుకతమిస్రపూర్వుతుఁ జెందిన తేనెలు పద్మబంధువే
తరణి, స్వకీయమౌ కిరణతాపము పెల్లున నింకఁబెట్టె డ
గ్గరన ద్విరేఫపాళి మెఱకల్గని మల్లులమూడ్చె క్రొత్తతా
మరచెలికారమే విడఁడు మాడ్చెనుఁ దక్కినవారి నన్నిఁటిన్.

వేనుఁడు : కౌషీతకా! ఆ మొండివాఁ డెవఁడు?

అంగరాజు : రాజుకన్న బలవంతుఁడు.

కౌషీతకుఁడు : [ప్రవేశించి] వేనుఁడా! ఆయన వినీతభట్టు నల్లుడు. తనకుమారునిమృతికి వగచి తనకొడుకు చచ్చిన చావే చావవలయునని వచ్చి కైవారము చేయుచున్నాఁడు.

వేనుఁడు : అట్లయినచో వానియిష్టముప్రకారమే కానిమ్ము. కౌషీతకా! సేనానాయకుఁడై నమృత్యువుతో నిట్లు చెప్పుము. నాయాజ్ఞాతిరస్కారము చేసినవారినెల్ల నిర్దయతోఁ గారాగారములయందు వేయించవలయును.

కౌషీతకుఁడు : వేనుఁడా! కారాగారము లేమిటి? కొరడాలతోఁ గొట్టించుచున్నాఁడు. ఏనుగులచేతఁ ద్రొక్కించుచున్నాఁడు. ఒకవేళఁ గారాగారములయందు వేయించినను వారు మరల బయటకుఁ బోవుటలేదు.

వేనుఁడు : ఇట్లు జరుగుచున్నదని ప్రజలందరకుఁ దెలియునా?

కౌషీతకుఁడు : తెలియదు. ఇవన్నియు రహస్యముగా జరిగించి వారందరు జాడ్యములు వచ్చి చచ్చిపోవుచుండిరని జనులకుఁ దెలియఁజేయుచున్నాఁడు.

వేనుఁడు : సరే! పొమ్ము.

కౌషీతకుఁడు : [నిష్క్రమించును]

అంగరాజు : సిద్ధాంతములు వేరు, ఆచరణలు వేరు. తండ్రి వేరు, కొడుకువేరు. తండ్రికిఁ బుట్టినకొడుకు తండ్రివలె నాచరించుచున్నాఁడా? అట్లే సిద్ధాంతములనుండి పుట్టిన యాచరణములు సిద్ధాంతములవలె నుండనక్కరలేదు. ఈ తిర్యగ్జగత్తునకు బుద్ధిలేదు. అది సరిగాఁ దాను పుట్టిన జాతిధర్మమునే యనుష్ఠించుచున్నది. పెద్దపులికిఁ బుట్టిన పిల్ల పెద్దపులివలెనే నడుచుచున్నది, గరుత్మంతునికిఁ బుట్టినది గరుత్మంతునివలెనే యున్నది. మామిడిటెంకనుండి నిమ్మచెట్టు పుట్టలేదు. అయ్యో! మనస్సులేని, తెలివితేటలులేని యీతిర్యగ్జగత్తు మార్పులేకుండ నడచుచున్నది. మనస్సుగలిగి వివేకముగల మేము చూడుము. ఎప్పటికప్పుడు క్రొత్తగా నడచుచుంటిమి. మే మనునది యొకటి,

చేయునది యొకటి. భగవంతుఁడుచేసిన సృష్టిమీఁద నభివృద్ధిచేయుచుంటిమి? అందరు మానవులునొకటే. ఎక్కువతక్కువలు లేవని మాసిద్ధాంతము. మేము మాత్రము రాజులము. మే మెవరిని జంపినను తప్పులేదు. అది మాసిద్ధాంతములోని భాగమే. రాజు తనప్రజను దా నురితీయించవచ్చును. భర్త తనభార్య నేమియుఁ జేయరాదు. తండ్రి తన కొడుకు నేమియు ననరాదు. ఓహో! న్యాయము న్యాయము!

ఆకాశమున నేగు ద్విజోత్తములార!
లేక ధరిత్రి నుల్చెడు తరూత్తములార!
వే కాననంబునఁ బర్వెడు మృగోత్తములార!
పోకల్లేమైన పూరుషోత్తములార!
ఈ ధర్మ మెఱుఁగుఁడీ యెఱుఁగుఁడీ ధర్మమ్ము.

వేనుఁడు: కౌషీతకా ఈ యంగరాజును దీసికొనిపోయి కైదులో నుంచుము.

అంగరాజు: ఎవఁడు నన్ను బంధించునది? ఎవనియాత్మ యెవని వశములోన లేదో వాఁ డివివరకే బంధితుఁడై యున్నాఁడు. నా యాత్మ నా వశములో నుండఁగా నాకు వేరే బంధమే లేదు. నన్నుఁ గారాగారమున నుంచుము. నే నక్కడకూడ నీపాటలే పాడెదను. నన్నుఁ జంపి వేయుము, నేను గాలిలో నీపాటలే మ్రోఁగెదను. నన్ను నీవు కైదులోఁబెట్టలేవు; చంపనులేవు. ఓహో జనులారా! చూడుఁడు. వీఁడు నా కడుపునఁబుట్టిన బిడ్డ;

నా సొమ్ము తిని బ్రతుకుచున్నవాఁడు. నా రాజ్యము అన్యాయముగా నపహరించినవాఁడు. నన్ను బంధించున౯ట. నన్ను రితీయించునఁట. నన్నుఁగొరడాలతో గొట్టించునఁట. నన్నేనుఁగులచే మట్టించునఁట. నాకన్నముపెట్టక యింటి నుండి వెడలఁగొట్టినాఁడు. నన్ను మోసముచేసి నా రాజ్య మపహరించినాఁడు. నాకుఁదాను పుట్టనేలేదనుచున్నాఁడు. నా సునీథను నానుండి యపహరింపఁ జూచుచున్నాఁడు. ఈ యన్యాయ్యముచూడుఁడు చూడుఁడు! మీకుఁ జెవులు లేవా? వినఁబడుటలేదా? కన్నులు లేవా? కనఁబడుట లేదా? ఒక ముసలివాని నీ దుష్టు బంధించు చుండగాఁ జూచెదరేల? ఛీ! ఛీ! మనుష్యులైన మీతోఁ జెప్పు కొనుటకన్న గాలితో నీరుతో నిప్పుతోఁ జెప్పుకొన్న లాభముకలదు. ఓ వాయువా! నీవు వీని నాసారంధ్రముల నాడకుము. ఓ జలమా! నీవు వీనికిఁ బ్రాణప్రదానము చేయకుము ఓ యగ్ని! నీవు వీని ప్రాణానిలముల కాధార పడకుము. మనుష్యులకు బుద్ధులుపోయినవి; కాని జడ పదార్థములకుఁ బోలేదు, పోలేను. లేకున్నచో మాపృథువు ముక్కులోనుండి నిశ్వాసరూపమున వాయు వేల యాడు చున్నది. జలాధిదేవతలు మా పృథువు ప్రాణము లేల కాపాడు చున్నారు. మూఁడువేళల నాచేతఁ బూర్ణము సమర్పితుఁడైన యగ్ని మాపృథువునకుఁ బ్రాణరక్ష యేల చేయుచున్నాఁడు. తేజస్సు మా పృథువు నాననమున నేల యట్లు వేదాత్మనలె వెలుఁగుచున్నది. పంచభూతముల

నిండఁ బ్రాణముసిండి తొలుకాడుచున్నది. లేకపోయిన నా మహాభూతములలో నంత మహాధ్వని యేల చెల్ల రేగవలె!

ఓ సముద్రనదీమహోదదేవతలార !
భూ సమానాగ్ని దేవతలార ! వ్రతులార !
వాసించి చరియించు వాయుదేవతలార !
ఆకాంతరహితవైహాయసాధిపులార !
ఉరతీయు నెవఁడు మి మ్మొరతీయు నెవ్వాఁడు
కరులఁ ద్రొక్కించు నిక్కముగ మి మ్మెవ్వాఁడు
కొరడాల దండించు గుణి మిమ్ము నెవ్వాఁడు
ఎవ్వాఁడు మిమ్ము శాసించఁ గల్గిన ఱేఁడు.

[అంగరాజును బంధింప భటులు వత్తురు]

పృథువు : వేనా! ఇతఁడు పిచ్చివాఁడుకదా, ఇతనిని బంధించి ప్రయోజన మేమి ?

అంగరాజు : నేను పిచ్చివాఁడనని వేనునకు నమ్మకము లేదు. పై కట్లు చెప్పును. నిజమునకు వేనునకు దేనియందు నమ్మకమున్నది? దేనియందును నమ్మకము లేదు. కొన్నింటి యందు నమ్మక మున్నట్లు నటించును. ఆ నటించుట యెందులకా ? లోకమును మోసము చేయుటకు.

వేనుఁడు : కౌషీతకా ! ఈయంగరాజును దీసికొనిపోయి భద్రముగాఁ గారాగారమున నుంచుము. ఆయన కేది కావలయు నన్న నది యీవలయును. కారాగృహములో నాతని స్వేచ్ఛకు మీరు భంగము తేరాదు.

అంగరాజు : వేనుఁడా! నీమేలుకొఱకే చెప్పుచున్నాను. నన్ను గారలో నుంచుట నీకు శ్రేయస్సు కాదు. శ్రేయస్సేమిటి? కాకపోవుటేమిటి? తల్లి చెవులు త్రెంచినవానికిఁ బినతల్లి చెవులు బీరపూవులఁట. భగవంతుడే లేడన్న వానికిఁ దండ్రి యున్నాడా? వేనా! నీవు స్వాయంభువవు. నీయిష్టమే యిష్టము. రాజ్యము చేయుము. భటులారా! పదండు, నేను మీవెంట వచ్చెదను. వేనా! చేతులకు సంకెలలు వేయించుకొమ్మందువా? (రెండుచేతులు దగ్గరకుఁ బెట్టి) ఇంక నడువుఁడు. వచ్చుచున్నాను. చేతులు బంధించినచో నన్ను బంధించినట్లా? చేతులు నేనా? ఈచేతులు నేనైనచో ఈచేతులు విరుగ నను కొమ్ము, అప్పుడు నే నుండనా? కాళ్లు తెగఁగొట్టినచో నప్పుడు నే నుండనా? కనుక కాలు సేతులు నేనుకాదు. పృథూ! నీవు చెప్పుము. వానిని బంధించినచో నన్ను బంధించు టెట్లగును?

వేనుఁడు : పృథూ! చేతులు, కాళ్లు విరిగినచో నే నుందును. మెడ విరిగినచో? కావునఁ గాళ్లు, చేతులు నేనుకాదు, మెడ నేను. నన్ను బంధించఁదలఁచినచో మెడ బంధించవలయును. నన్ను జంపవలయు నన్నచో మెడ నఱకవలయును?

[తెరలో - అమంగళ మప్రతిహతమగుఁగాక]

వేనుఁడు : [నవ్వి] పృథూ! పృథూ! చూచితివా! ఈ గొరువంక యేమనుచున్నదో? అమంగళ మప్రతిహత

మగుఁగాకయుఁట! ఛీ! ఛీ! బిజిలీ! నీవు గోరంకవయ్యును మాటలు నేర్చినందుకు నీరాజునకు నమంగళము కోరు చున్నావా? రోజును లడ్డు జిలేబులు తిని చివరకు నా కిదా యుపకారము? నీ కీ మాట లెవరు నేర్పిరి?

[తెరలో - గౌతముఁడు నేర్పెను]

వేనుఁడు: చూచితివా! పృథూ! గౌతమునకు నా ప్రాణ ములమీఁద నెందు కింత విరోధము.

పృథువు: గౌతమున కిట్టివక్రపుఁగూతలు నేర్పిన దెవరు?

[తెరలో - వేనమహారాజు]

పృథువు: గౌతమున కీ మాటలు నేర్పినది నీ వనుచున్నది యీ గోరువంక. అందుచేత నీ ప్రాణములమీఁద నీకే విరోధమని తేలుచున్నది.

అంగరాజు: ఎదుటివారిప్రాణములమీఁద నా కెప్పుడు విరోధ మైనదో నా ప్రాణములమీఁదఁగూడ నా కప్పుడే విరోధము. నా మెడయును నేను నొకటా? కాదుకాదు. నా మెడయు నేను నొకటియైనచో 'నేను', 'నామెడ' అను రెండు భిన్నవస్తువు లేల యుండును? నామెడ నఱికినచో నేను పోను, నాపాణములుపోవును. నా ప్రాణములు వేరు, నామెడవేరు, నేనువేరు. నాపాణములుపోవును, నామెడ పోవచ్చును, నేనుపోను. నే నెచ్చటికిఁ బోదును? అనంతమైన యీ యాకాశమంతయు నే నావరించియుంటిని. నేను జలములో నున్నాను, అగ్నిలో నున్నాను, వాయు

వులో నున్నాను, తేజస్సులో నున్నాను; నేను లేనిచోటు లేదు. శబ్దములో నేను, భావములో నేను, మనస్సులో నేను, సర్వేంద్రియములు నేనే, నేను కానిదేది? బంధితుండను నేన, బంధించినవాండను నేన, బంధము నేన, నన్ను నేనే బంధించుకొంటిని. నాయిష్టమైనచో నే నీబంధము నుండి వదలించుకొన గలను. ఇదిగో వదలించుకొను చున్నాను. [నిష్క్రమించును]

వేనుఁడు : పృథూ ! చూచితివా ? ఆ పిచ్చివాని మాటలు గజము మిథ్య, పలాయనము మిథ్య యన్నట్లున్నది.

పృథువు : ఆయనది మిథ్యావాదముకాదు, "అస్తి" వాదము.

వేనుఁడు : "అస్తి" వాదము కాదు, అస్థికలవాదము.

పృథువు : ఆ వాదము మనది.

వేనుఁడు : అనగా?

పృథువు : అనగా? వినీతభట్టు, వాని యల్లుడు, వాని మనుమఁడు వీరందఱి యస్థికలు మనవాదమువలననేకదా కలిగినవి. అసలు మనది అస్థికలవాదము.

[తెర]

## నాల్గవ యంకము

[రాజాంతఃపురము - వేనుఁడు కౌషీతఁకుడు ప్రవేశము]

వేనుఁడు : ఈ వేసంగివెన్నెల పుష్యరాగములకాంతులు వెదఁజల్లినట్లు మల్లెపూవులు పారబోసినట్లు మబ్బులు విరిసిపోగా లేతయెండలు తళతళలాడినట్లు మాపృథు నవ్వినట్లు విరఁబోసికొన్నది. మాపృథు నవ్విన తెల్లనికాంతులలో నామెదంతములు కనఁబడీ కనఁబడనట్లు ఈవెన్నెలలో దూరాన తోఁటచివరఁ గల కెల్లుపూవులు కనఁబడీకనఁబడుటలేదు. ఈచల్లనిగాలి స్నేహితునివలె వెనుకనుండి వచ్చి నన్ను మెల్లగాఁ దాకుచున్నది. అవునవును. నా స్నేహితునకు నాకును దూరమై పోయినది. గౌతమా! గౌతమా! ఓయీ! నాగుండెకాయ! ఓయీ! నాయెదలో నుంచుకొన్న చిన్నారిదీపమ! నన్ను వదలిపోతివికదోయి. నాగౌతముఁడు లేనివెన్నెల నాకు బాగుగాలేదు. నాప్రాణములు అల్లల్ల గాలిపొరలమీఁదఁ దేల్చుకొనిపోవుటలేదు. సముసము వీడియెటులుంగని మా చెలికారమున కెట్టి దుర్దినములు వచ్చినవి? నేఁటికి నాలుగునాళ్ళనుండి నాకు నిద్రాహారములు లేవు. నేను కృశించినట్లున్నది. వెడందయై బిరుసువారిన నాయెదురొమ్ము ఉబ్బుతగ్గి సడలినది. నా చేయి చేయి తాకినచో నాకే కఠినముగాఁ గన్పించుటలేదు. గౌతముని మీఁదినుండి నామనస్సెట్లు త్రిప్పుకొందును. పోయి గౌతమునిసిద్ధాంతము లంగీకరించితి నని చెప్పుదునా! ప్చ్? అతనివాదములు కొంతవరకు గంభీర

ములుగ నున్నవే! ఇన్నాళ్ళు నేను సర్కించి యేర్పరచిన సిద్ధాంతములే తప్పులా? ఈరాత్రి చంద్రకేతక్రీప్రాసాదము నందు వీణవాయించుకొందును. అదియే మార్గము.

[నిష్క్రమించును]

గౌతముఁడు: [ప్రవేశించి] వేనుఁడెందున్నాడో! అంతఃపుర మంతయు వెదకితిని. అతఁడెందునుఁగానరాఁడు. ఆతఁడో నేనో – యిద్దరిలో నెవరమో యొకరమే మిగులవలయును. ఛీ! ఛీ! వేదములు మూలఁబడినవి. శాస్త్రములు చట్టు బండలయినవి. వేదాంగములు త్రుప్పుపట్టినవి. ధర్మ శాస్త్రములు దగ్ధమైనవి. వేనా! వేనా! నీవు వేదము లక్కఱలేదనువాఁడవు. నేను కావలె ననువాఁడను. నేను చనిపోయి లోక మంతయు సర్వేదమైనఁగావలయును. నీవు చనిపోయి శోషనడిన వేదమాత మఱలఁ దెప్పిరనైన దెప్పిరిలఁలయును. నేను బ్రాహ్మణుఁడను. నీవు క్షత్రియు డవు. నీ కస్త్రశస్త్ర నైపుణ్యము కలదు. నాకు లేదు. అయినను నీతోఁ గత్తియుద్ధముచేసి యీసంగతి తేల్చుకొన వచ్చితిని. ఇదిగో! ఈవెన్నెలలో నాకత్తి కుబుసము విడిచిన తెల్లత్రాచువలె తలతలలాడుచున్నది. నిజముగా నాతలయే తెగిపోవును. లోకాతిశాయియైన వేనుని పరాక్రమ మెక్కడ? చిన్ననాఁటినుండి వేనుని పూర్వులిచ్చిన యగ్ర హారములమీఁద బ్రతికిన నే నెక్కడ? నిజమే, నేనే చనిపోవలయును. మావేనుని తలవెండ్రుకయుఁ జెదర కూడదు. ఛీ! ఛీ! నేను చనిపోవుట నాచనిపోవుటతో

నాగిపోయినయెడల నేనే చనిపోవచ్చును గాని యది వేదధర్మనాశనపిశునమైనయెడల నట్లు కారాదు. వేనుఁడే చనిపోవలయును. వేదమతము మఱల నిలువవలయును. ఓహో! వేదమాతలార! ఋష్యాత్మలార! ధర్మదేవతలార! మీ శక్తియంతయువచ్చి నాబాహువునందును నాకరవాలమునందును నిలుచుఁగాక! నే నిదే వేనాసురవధార్థము బయలుదేరుచుంటిని. వేనుఁ డెక్కడనున్నాడు? కౌషీతకా! వేనుఁ డెక్కడ?

కౌషీతకుఁడు: ఏ నట్లు వచ్చితివి? వేనుఁడు చంద్రికేతకీప్రాసాదమున వీణావాదనము చేయుచున్నాఁడు.

గౌతముఁడు: అట్లనా! అతని సంగీతము విని యెన్నాళ్ళయినది. ఓహో! ఈచంద్రకాంతశిలలు ద్రవించుచున్నవి అతని సంగీతమువలననే కాబోలు! కౌషీతకా! అదిగో నా కా ధ్వని వినవచ్చుచున్నది. నే నిందుండి యతనిసంగీతము వినెదను. నీ విఁకఁ బోవచ్చును. [కౌషీ—నిష్క్ర]

గౌతముఁడు: [నిమీలితాక్షుఁడై] ఆహా! ఏమి యా ధ్వని సౌందర్యము!

కలువపూవులోని పచ్చలదిమ్మచుట్టును ముసిరి తుమ్మెదగమి మ్రోసినట్లు
మెత్తని యిసుకలమీద సన్ననినీటితొరజాలు ముద్దుగ పుట్టినట్లు
తల్లి రెక్కలో దాగి వెచ్చగ సందకూన క్రొమ్మెడ వంచి కూసినట్లు
తేనెమబ్బుపొద వాలించి పొలాలపైనుండి వచ్చిన గాలి యూదినట్లు

ఏ పురాజన్మ సంస్కారమో! పరిణత
మై స్వయంగా స్ఫురించినట్లు మంచు
గొండ తెల్లని కొమ్ముల గూండ కట్టు
తుమ్మెదలపట్టు తేనియల్ తొణికినట్లు.

వేనా! వేనా! నీ యీ సంగీత మెన్నిసారులు వింటిని. అన్ని సారులు నన్నిట్లే చేయుచున్నది. ఈధ్వని నాదేహములో నున్న సర్వరక్తనాళములను బెల్లగించుచున్నది. వేనా! నీ వే విధముగా బ్రతుకుటకుఁ దగనివాఁడవయినను, నీ సంగీతము, నీశిల్పము, నీకవిత్వము – వీనిమాధుర్యముచేత నయినను బ్రతుకఁదగినవాఁడవే! ఇంతసౌందర్య మెఱిఁగిన నీయాత్మలోనుండి యింతటియధర్మము వెలువడుట మా దౌర్భాగ్యముగాక మరేమి? అదుగో! అదుగో, అన్నా! అన్నా! నీ యీ కేదారగౌళ యింత మనోహరముగా నే నెన్నడు వినలేదు. గౌరీజానికంఠభూషణమ వైన యోరాగచూడామణీ! మావేనుని కరాగ్రస్పర్శచే వీణతంత్రులమీఁద నీవు సరిగా

సారిది గోదుమవన్నె త్రాచు లొకటొకటి
ప్రేమఁ బెనవేసికొనుచు పింపిళ్ళుకూసి
నట్లు గేదంగిపుప్పొడులంగు మెరసి
పోయునట్టులు మధునాదమూర్తి వై౹.

హా! హా! ఇంతటిసంగీతవిద్య భూలోకమునుండి యంతరించుటా? పోనిమ్ము! పోనిమ్ము! లోకమంతయు వేదబాహిరముకానిమ్ము! ఆ వేదధర్మమువలన లోకము సంపా

డించుమోహము నీసంగీతమువలనఁ గళలవలన లోకము సంపాదించుఁగాక. ఛీ! ఛీ! నామనస్సునను మోహము క్రమ్ముచున్నది. సంగీతాదికళలవలనఁ బ్రాప్తించుమోహము నందు నిత్యత్వములేదు. ఎట్లైనను వేనుఁడు గతించ వలసినదే. అయినను నీరాత్రిమాత్రముకాదు. ప్రశాంతమై చల్లనైన యీవెన్నెల నాకోపముమాటలచేఁ గదలి పోయి మానెత్తురుచే వెచ్చనఁగారాదు. మావేనుని దివ్య సంగీతసునాదముచేత మహాశ్రుతి మేళవించుకొన్న యీ వాయుమార్గములయం దపశ్రుతి కలుగరాదు. అదుగో వేనుఁడు సంగీత మాపి యిట్లు వచ్చుచున్నాఁడు! నే నిందుండి పోయెదను.

[వేనరాజు ప్రవేశించును - గౌతముఁడు నిష్క్రమించును]

వేనుఁడు: ఇంత సంగీతవిద్య నా కేలవచ్చినది? ఇంతటి విద్యయు నాకు గౌతముసంగతికూర్చిన యానందము కలిగించలేదు. ఓహో! ఈ వాయువీథులు నా గానశ్రుతులను మేళవించుకొని యింకొకధ్వని నెకరనీయుటలేదు. ఈవాయుతరంగములు శ్రుతులు కలుపుకొని మెల్లగాఁ బూలకొమ్మలల్లల నాడినట్లల్లలనాడుచున్నవి. నాయాత్మ అదొకరీతి మైమరపులోఁ దన్మయభావమును బొందుచున్నది. ఏమో! నాలునాళ్ళుగా లేని యీ సౌందర్య మీ యంతఃపురమున కెచ్చటినుండి వచ్చినది?

పృథూ! పృథూ! తల్లీ! ఏమినిద్దురయే!

పృథువు: ఎందుకు వేనా?

వేనుఁడు : నన్నన్నా యని పిలచెద నంటివికాదా ? అన్నా యనుము.

పృథువు : అన్నా ! నన్నెందుకు నిద్రలేపితివి ?

వేనుఁడు : తల్లీ ! ఈ యంతఃపురము చూడుము. ఈ నాలు నాళ్ళుగా లేని సౌందర్యము దీని కెక్కడనుండి వచ్చినది?

పృథువు : నీ వింతసేపు వీణవాయించుచుంటివా ?

వేనుఁడు : అవును.

పృథువు : అన్నా ! నీవు వీణవాయించునపుడు నీయాత్మలో దేవతలు నిలచుచున్నారు. ఆపాదమస్తకము నీ వొక దివ్యపురుషుఁడ వగుచున్నావు. నీ యాత్మయు మనస్సును ననంతమైన సౌందర్యమును గడించుకొనుచున్నవి. ఇప్పు డందుచేత నీకు సర్వమును సుందరాతిసుందరముగాఁ గన్పించుచున్నది.

వేనుఁడు : తల్లీ ! అట్లుకాదు. నాలుగునాళ్ళుగా గౌతముఁడు లేకపోవుటచేత నతని ప్రసన్నత యెఱుఁగకపోవుటచేత లేనిశోభ యీ యంతఃపురమునకు నేఁ డతని ప్రసన్నత కలిగినట్లు వచ్చినది.

పృథువు : ఆతఁ డిప్పు డిచ్చటికి వచ్చెనేమో !

వేనుఁడు : ఇంక నామొగము చూడనని పోయినాఁడు. అతడు వచ్చునా? అయినను - కౌషీతకా ! గౌతముఁ డిప్పు డిచ్చటికి వచ్చెనా ?

కౌషీతకుఁడు : [వచ్చి] అవును, వచ్చి యిప్పుడే వెళ్ళెను.

వేనుఁడు : ఎంతసేపు అయినది వచ్చి ?

కౌషీతకుఁడు : నీవు చంద్రకేతకికిఁ బోయినంతనే వచ్చెను.

వేనుఁడు : మఱి యిప్పుడేనా వెళ్ళినది. అయినచోఁ జాలసే పుండుండెనన్నమాట. నేను వాయించినంతసేపున్నాఁడు. నేడు శుక్లాష్టమికదా ? వెన్నెలలు వచ్చినంతనే నేను చంద్రకేతకికి వెళ్ళితిని. ఇదుగో! ఇప్పుడు రాత్రి రెండు జాములు కావచ్చుచున్నది. మొగ్గవేసిన ప్రాగ్దిశాంగన మొగమువలె చంద్రుఁడు వ్రాలియున్నాఁడు. వెన్నెలలకుఁ దెల్లదనముపోయి బియ్యపుగింజరంగు వచ్చుచున్నది. ఇంతసేపు గౌతముఁ డిందేయుండెనా? కౌషీతకా! నన్ను బిలువకపోయితివి.

పృథు : అన్నా ! మీ రిద్దరు పోట్లాడుకొంటిరికదా!

వేనుఁడు : చిట్టితల్లీ! అతనికి నాకు పోరాటమా ? చంద్రునకు వెన్నెలకుఁ బోరాట ముండునా ? కత్తికి దాని పదునుకుఁ బోరాట ముండునా? నాకన్నులకుఁ గంటిచూపునకుఁ బోరాట ముండునా ?

గౌతముఁడు : [ప్రవేశించి] వేనునకు గౌతమునకుఁ బోరాట ముండునా?

వేనుఁడు : [కౌఁగిలించుకొని] తమ్ముఁడా ! మంచునీటిలో స్నానమాడి వచ్చితివా ? పన్నీటిలో జలకమాడివచ్చితివా? నీ యొడ లింతచల్లనై కమ్మనై యున్న దేమి?

గౌతముఁడు : ఇందాకటినుండియు నీ గానవాహినిలో స్నాన మాడుచుంటిని. తత్సౌరభములో నోలలాడుచుంటిని.

వేనుఁడు : చంద్రకేతకిమీఁదికి రాకపోతివా ?

గౌతముఁడు : ప్రశాంతమై చల్లనైన వెన్నెలలు కదల్చి వెచ్చగిల్లఁజేయుటకు మనస్కరించలేదు.

వేనుఁడు : తమ్ముఁడా! నీవు వచ్చితివని యీ సౌధముయొక్క నూత్నశోభయే చెప్పినది. నీవులేని పవళ్ళు నాకుఁ గడచు చున్నను రాత్రులు కడచుటలేదు. అందుచే నీ తరువాతి నెచ్చెలియైన వీణవద్దకుఁ బోయితిని.

గౌతముఁడు : అన్నా! అన్నా! ఆ వీణను నేను ముక్కలు ముక్కలుగాఁ జేసెదను. దానిని నా చేతికిమ్ము. అది నాకు లేని సౌఖ్య మెందు కనుభవించుచున్నది? దాని కాత్మ లేదు. దానికి ధర్మజిజ్ఞాసలేదు. అందుచేత నది నీతోఁ బొరపులేని చెలిమి చేయుచున్నది. అన్నా! నన్నింకొక్క సారి కౌఁగిలించుకొనుము. నే నింటికిఁ బోవలయును.

వేనుఁడు : తమ్ముఁడా! ఇంక గొంచెమునే పోగలవు. ఆ చంద్రుఁ డస్తమించువఱకు కాగుము. వాఁ డింకెంతలోనో అస్తమించఁడు. చూడుము, క్రమక్రమముగా నెఱ్ఱపడు చున్నాఁడు. తూర్పుదిక్కంతయు పునుగుపూసిన ట్లగుపడు చున్నది. పాలుత్రాగు పసిబిడ్డ తన మొగములోఁ గొంత భాగ మాక్రమించుకొనగా మిగిలిన మాతృదేవీ స్తనమండ లమువలె నీ శుక్లాష్టమీపరివర్ధమానార్ధాధికచంద్రబింబము

రమ్యతరముగానున్నది. అతఁ డింకొక్కకళ సవరించుకొనఁ బోవులోపల నన్ను గాటముగాఁ గౌఁగిలించుకొనుము. నీ వియోగ పరితప్తమైన నా యీ సౌధదేహాళికి మెఱుంగు పూఁత పెట్టుము. కౌషీతకా! ఆ మాణిక్యదీపము నట నుండి తీసివేయుము. దాసకృత్రిమ దీప్తులచేత గౌతముని ముఖమండలి యకృత్రిమసౌందర్యము వెగటువేయుచున్నది. పండిన వెట్టిని మొక్కజొన్న గింజలు రాశివోసినట్లున్న యీ చంద్రబింబము పెట్టడము లేకపోవుటచేత మన వంకనే చూచుచున్నది. ఇంకఁ గొంచెము సేపటికిఁ జీకట్లు రాఁగలవు. దౌర్భాగ్యపుఁ జీకటిలో నీ వెన్నెలతీగవంటి యందము నా మనస్సునకు చూడఁ జూడ బాధకలి గించును. తమ్ముఁడా! ఇంక వెళ్లుము. నీవంకఁ గనులార చూచితిని. నన్నుఁ జేతులారఁ గౌఁగిలించుకొంటిని. నిన్నుఁ దనివితీర ముద్దుపెట్టుకొంటిని? ఇంక నీవు పోవచ్చును. ఏల యింటికిఁ బోనలె ననుచుంటివి!

గౌతముఁడు: ఇంటివద్ద నాభార్య నాకొఱ కెదురు చూచు చుండును.

వేనుఁడు: నీ భార్యయా! ఆమె యెవరు?

గౌతముఁడు: ఎవ రేమి? నా భార్యయే

వేనుఁడు: నీవు పెండ్లి యెప్పు డాడితివి?

గౌతముఁడు: నాచిన్నతనములోనే నా తలిదండ్రులు చేసిరఁట.

వేనుఁడు: వేనునియాజ్ఞ యేమైనది!

గౌతముఁడు : రహస్యముగా దేశ మంతటను జరుగు నిట్టి వివాహములను దాకలేక పైపైని దిరుగుచున్నది.

వేనుఁడు : ఆమె యందకత్తెయేనా ?

గౌతముఁడు : పృథుకన్న నందకత్తె. పృథు సౌందర్యములో కొంత పుంస్త్వమున్నది. నా భార్యయందములో స్త్రీ సౌకుమార్య మంతయు నున్నది. అది వెన్నెలవత్తి.

వేనుఁడు : గౌతమా ! స్త్రీలు కామమోహితులైన పురుషుల కంటి కందకత్తెలవలెఁ గన్పింతురు కాని, నిజముగాఁ బురుషులే యందగాండ్రు. నిజముగా నాకు స్త్రీల సౌందర్యము నచ్చదు. నీయందున్న సౌందర్యము మఱి యెచ్చటనైనఁ జూపించుము. కనంబడదు. మృగపక్ష్యాదులయందుఁ గూడఁ జూడుము. స్త్రీజంతువులకన్నఁ బురుషజంతువులే యెక్కువ యందమైనవి. సంగీతము చూడుము. సన్నని యాడగొంతుక మెచ్చుకొన్నట్లు లోకము మంచి జిగికలిగిన భావాభిరామమైన గొంతుకను మెచ్చుకొనలేదు. స్త్రీ ప్రకృతిలో నొక్కటే ఛాయ. అది సర్వత్ర యట్లేయుండును. పురుషప్రకృతి యట్లుగాక భావముల కనుగుణముగా విస్పష్టముగా మారుచుండును. కవిత్వమందుఁ గూడ నంతియ. ఒక చిక్కని తియ్యని శైలికలవానికవిత యంతయు భావముల వెంటమారక నొకతీరున నడచుచుండును. భావమునకే ప్రాధాన్య మిచ్చుకవి కవిత్వము శయ్యలో భావమును బట్టి మారును. కాని, లోకము ఆశయ్యను, ఆ స్త్రీసౌందర్యమునకుఁ బ్రాధాన్య మిచ్చు

చున్నది. కాదన్నచో వినదు. పదిమంది నడచినదే త్రోవ. మన మేమిచేయఁగలము?

గౌతముఁడు: అన్నా! నీవంటి దివ్యపురుషులు జన్మించనే జన్మించరు. జన్మించినను, నీవంటి మహాప్రత్యేకతా లక్షణములు కలవారివలన లోకమునకు లాభము లేదు.

వేనుఁడు: నాయన్నా! నీవును నీభార్యయు సుఖముగా నుండుఁడు. నీ విందుఁ బొమ్ము. [ఒక యుంగరము తీసి] ఇది వేనుని కానుకగా నీభార్య కిమ్ము.

గౌతముఁడు: అన్నా! ఇంక నే నేగెదను. అదుగో! వెన్నెలను వదలిపెట్టి కొయ్యబారినట్లు చంద్రుఁడు నిశ్చలముగా నస్తగిరిమీఁద కాలు మోపుచున్నాఁడు [నిష్క్రమించును]

వేనుఁడు: పృథూ! నీవింతసేపు నేమియు మాట్లాడలేదేమి?

పృథు: మీరిద్దరు నన్ను మాటాడనిచ్చినఁగదా?

వేనుఁడు: ఓసీ దొంగ! నీ మొగము చూచిన నీవును నంతసేపు మాట్లాడుచున్నట్లే యున్నదే. మాట్లాడకయు నితరుల మాటలు మన కిష్టమైనచో మనమును మాట్లాడినట్లే యుండును. నీవు సరిగా గౌతమునివలెనే మాట్లాడెదవు. అందుచేత నతఁడు ప్రసంగించుచుండగా నీకు నీవును ప్రసంగించినట్లే యున్నది.

పృథు: నీకు నిద్ర వచ్చుటలేదా?

వేనుఁడు : నీకు నిద్ర కన్నులవెంటఁ గారుచున్నది. నీపసి కన్నులు మూసికొనుచున్నవి. చంద్రునిఁ జూడుము. ఛెంగావిరంగు వేసిన సన్నని గుడ్డపేలికవలె నెంత మిగిలి యున్నాఁడో? నీకు నిద్రవచ్చుచున్నచో నీవు నాయొడిలోఁ బండుకొనుము. పండిన సంపంగిరేకులవలె నీ ఱెప్పలు కనీనికలమీఁదికి వ్రాలుచున్నవి. ఓహో! పృథు నా యొడిలో నిద్రపోయినది. పసినిద్ర యంత తేలికగా వచ్చును. ఇంతలోఁ గన్ను తెరచి యుంతురు. ఇంతలో నిద్రపోవుదురు. ఈ ప్రపంచకమంతయుఁ బసివాండ్రతోనే నిండి యుండరాదా? అప్పుడు స్వర్గమువలె నుండునే. చంద్రుఁడు పూర్తిగాఁ బోయినాఁడు. చీఁకట్లు నాల్గుదిక్కుల నలముకొన్నవి. అదియేదో పక్షి కూయుచున్నది. సన్నగా నీల వేయుచుఁ జల్లని యీ త్రియామాశృంగాటకముల రక్షకభటునివలెఁ గాచుచున్నది. ఓహో! ఆ కూఁతయేమి బాగున్నది! వీణ చివరితంత్రీమీఁద గోఁటితో నిట్లన్నట్లున్నది. శబ్ద మంతయుఁ బకృతి నిండ నున్నది. అది గానవిద్యలోనికి నేమూల వచ్చినది? ఆహాహా! ఈ రాత్రి యంతయు నిశ్శబ్దమై గంభీరముగుచున్నది. కౌషీతకా! నిష్కంచుకను వచ్చి పృథును దీసికొనిపోయి యామె సెజ్జ మీఁదఁ బరుండఁబెట్టుమనుము. నే నొక్కసారి సౌధాగ్రభాగమునకుఁ బోయి రాత్రిచేత నావరింపఁబడిన పట్టణ

ముచు జూచెదను. [పరిక్రమించి] ఓహో! యేమి యంద
ముగా నున్నది. ఏమియును గనిపించుటలేదు. కాని,
ఏదో నిరాకారతలో సాకారత తోఁచి మనస్సున కానంద
మగుచున్నది. నాకీ రాత్రియంతయు మహానందమయ
మైపోయినది. మఱల నా యీ జన్మకు నిట్టిరాత్రి
యింకొక్క డనుభవింతునా ?

[తెర]

# అ యి ద వ అ ం క ము

ప్రదేశము - కోటముందు.

అంగరాజు : [ప్రవేశించి] కాషీతకా! కాషీతకా!

కాషీతకుఁడు : [ప్రవేశించి] ఏదోపిలుపు, ఆజ్ఞవలె వినఁబడు చున్నది. మా వృద్ధరాజడవులుపట్టినతరువాత నా కిట్టి శ్రవణసుఖమైన పలుకు వినబడనేలేదు. ఎవ రాపిలుచునది?

అంగరాజు : కాషీతకా! కాషీతకా!

కాషీతకుఁడు : జయము! జయము మహారాజునకు.

అంగరాజు : ఓయీ! వేనుని నేను రమ్మంటి నని చెప్పుము.

కాషీతకుఁడు : దేవర యాజ్ఞాపించునట్లు [పరిక్రమించి] రాజు నకు పిచ్చిపోయినది, పోయినది. లోకము బాగుపడినది, పడినది.

అంగరాజు : ఆర్య! కాషీతక! నే నిదిగో సింహాసన మారో హించుచుంటిని. మహారాజు రమ్మనె నని వేనుని దత్క్షణము తీసికొనిరమ్ము.

[కాషీతకుఁడు నిష్క్రమించి - వేనకాషీతకులు ప్రవేశింతురు[

వేనుఁడు : కాషీతకా! వృద్ధరాజా? సింహాసన మందుండి నన్ను రమ్మనెనా? ఏమివిచిత్రము! సింహాసన మెక్కినఁ గాని రాజు కాఁడాయేమి? రాజైనవాఁడు సింహాసన మెక్కినను రాజే. ఎక్కకున్నను రాజే. రాజ్యము పూర్తిగా

నాపవశమైపోయినతరువాత మఱల తన కెట్లు వచ్చును? కాషీతకా! నీవుపోయి నేను రానంటి నని చెప్పుము.

కౌషీతకుఁడు: అయ్యో! అట్లు చెప్పరాదు. రాజు సన్నిధానమునకు వచ్చితీరవలయును.

వేనుఁడు: ఆ! ఏమి? ఓసీ! నే నెవ్వఁడ ననుకొంటివి? వేనుఁడను. సింహాసనమందుఁ గూర్చున్నంతమాత్రమున నీపిచ్చివాఁడు రాజు కాలేదు. రా జెవ్వఁడో చూపించెదను. [సమీపించి] అంగరాజా! ఎందులకు నన్ను రమ్మంటి వఁట?

అంగరాజు: నీ వెవ్వరవు? వేనుఁడవా? నీ రాజ్యమంతయుఁ జూచివచ్చితిని. ఎచ్చటఁ జూచినను ధర్మము నిండి తొణుకుచున్నది. ప్రజలకు స్వస్తిగా నున్నది. రాజు న్యాయముగాఁ బాలించుచున్నాఁడు. గోబ్రాహ్మణులకు శుభముగా నున్నది. లోకము లన్నియు సుఖముగా నున్నవి. పర్జన్యుఁడు కాలమునందు వర్షించుచున్నాఁడు. పృథివి సస్యశాలినిగా నున్నది. దేశము క్షోభరహితముగా నున్నది. బ్రాహ్మణులు నిర్భయులుగా నున్నారు. పుత్రులు లేని వారికిఁ బుత్రులు కలుగుచున్నారు. పుత్రులు కలవారికిఁ బౌత్రులు కలుగుచున్నారు. నిర్ధనులకు ధనలాభము కలుగుచున్నది. జనులందఱు నూరేండ్లు బ్రతుకుచున్నారు. నీ రాజ్యమంతయుఁ జూచి వచ్చితిని. చాల సుఖముగ నున్నది.

వేనుఁడు: ఇంక నెట్లున్నది.

అంగరాజు : ఎచ్చటఁ జూచినను ధర్మమే లేదు. ప్రజలకాపదగా నున్నది. రాజు న్యాయముగాఁ బాలించుటలేదు. గోబ్రాహ్మణులకు రక్ష లేదు. లోకము లన్నియు గగ్గోలు పొందుచున్నవి. పర్జన్యుఁడు నీటిచుక్క యయినను గురియుట లేదు. పృథివి సంపూర్ణముగా బీడువేసి పోయినది. దేశము క్షోభించిపోవుచున్నది. బ్రాహ్మణులకు భయ మత్యధికముగా నున్నది. పుత్రులు లేనివారికిఁ బుత్రులు లేరు. పుత్రు లోకవేళ నున్నచోఁ బౌత్రులు లేరు. సర్ధనుల కెడలేని దారిద్ర్యము. జనులందఱు నకాలమరణము లందుచున్నారు. ఆయుర్వేదమునం దెఱుఁగని వ్యాధులు ప్రబలి నూటికేబదిగా నిరువదేండ్లు రాకమునుపే చనిపోవుచున్నారు. నీ రాజ్య మంతయుఁ జూచివచ్చితిని. చాల సుఖముగా నున్నది.

వేనుఁడు : ఇంక నెట్లున్నది ?

అంగరాజు : దేశ మంతయు రెండుభాగములు. వైన్యులు అవైన్యులు. అవైన్యులకు రక్ష లేదు. వారి కిండ్లులేవు. భార్యలు లేరు. బిడ్డలులేరు. తినఁ దిండిలేదు. కట్ట గుడ్డ లేదు. నోరు మెదపినచో వారిని వైన్యులు చంపుచున్నారు. రెండవవారు వైన్యులు అన్నము లేకపోయినను లోపల గంజిత్రాగి వీథిలో మీసములు మెలిపెట్టుచున్నారు. మరలవారిలో వారికి భేదాభిప్రాయములు. వారును కొట్టుకొనుచున్నారు.

వేనుఁడు : ఇంక నెట్లున్నది ?

అంగరాజు : దేవాలయములలో వేనుని బెట్టి బూజించు చున్నారు. ప్రాచీన దేవాలయములను బడ గొట్టుచున్నారు. అడ్డమువచ్చినవారిని గొడ్డళ్ళుపెట్టి నరకుచున్నారు. భార్య లందరు భర్తలనువదలిపెట్టి పోవుచున్నారు. వేదమెచ్చటను వినబడుటలేదు. వినంబడినచో నపశ్రుతి కాక యింకొకరీతి లేదు. తపస్సులేదు. దమము లేదు. సత్యములేదు. శమము లేదు. నిష్ఠలేదు. పాతివ్రత్యము లేదు. ఉన్నది యనందగిన దేదియు లేదు.

వేనుఁడు : మజ్ఝారే! వేనమతము బాగుగాఁ బ్రబలినది. వేద మతము సర్వనాశమయినది. నీ సింహాసనము నీ వెక్కియు రాజువు కావు. వేనునియాజ్ఞ సర్వదిగ్వధూఫాలభాగములఁ గస్తూరీ తిలకమువలెఁ బ్రకాశించుచున్నది. మృత్యువా! మృత్యువా! నీదోయి మాహాత్మ్యము. వేనరాజు మత మింత ప్రబలుటకు నీ దోశ్శక్తి కారణము. వేదమతము సర్వనాశమైన తరువాతఁ బ్రపంచకమం దంతటను వేనుఁడే దేవుఁడు.

అంగరాజు : ఓయీ! వేనుఁడా! నాస్తికత్వము నీ మూర్తి తాల్చినది.

వేనుఁడు : లేనిభగవంతుని సృష్టించి యా భగవంతుఁడు లేఁడన్న వానిని నాస్తికుఁడనుట వెర్రివారలు నేర్చుకొనిన తెలివితేటలు. ఇట్టి దుష్టసిద్ధాంతము లన్నియు భిన్న భిన్న ములు చేయుటకే నేను పుట్టినది.

ముసలిభట్లు : [ప్రవేశించి] వేనమహారాజా ! నీ వొకయవతారమూర్తివి. రాజా ! ప్రొద్దు వాటారినది.

వేనుఁడు : నీ వెవ్వరవు

ముసలిభట్లు : నేను వినీతభట్లు వియ్యంకుడను. అయిదురోజుల క్రింద నా మనుమని మూన్నాళ్ళక్రింద నా కుమారుని నీవు చంపితివికదా ? నేడు నన్నుఁ జంపుము.

వేనుఁడు : నా యాజ్ఞాతిరస్కారముచేసినచో నట్లే.

ముసలిభట్లు : ఇదిగో !

ఓహో ! వేనధరణీధవ ! మతిజితసకలపూర్వరాజర్షి ! తృణీకృత సర్వపూర్వర్షి సిద్ధాంత ! ప్రత్యక్ష మృత్యుదేవత ! ఓయీ ! ప్రొద్దు వాటారినది. బ్రాహ్మణార్ఘ్య ప్రదానముల తోడులేక సూర్యదేవు డేకాకియై మందేహులకొల్లలకు తన్నుఁదాబురికొల్పుకొనుచున్నాఁడు. రాజా ! ఈ సాయంసమయమున నీరాజసౌధము శ్మశానవాటికవలె భగ్గునఁ దగులఁబడి పోవుచున్నది. పాపము నీమొగసాలయందుఁ బూర్వమువలె నగారా మ్రోతలు మేఘధ్వనులనుకొని నెమళ్ళు నృత్యము చేయుటలేదు

తనకిరణాలి నల్దెసలఁ దాపము వెంచిన నేల నెండఁజే
సిన జగమెల్ల బిట్టుగఁ గృశించఁగ మాడ్చిన తీక్ష్ణభానుఁ డ
ల్లన మలుకొండపై నొరుగులాగునఁ దోఁచెడి, కాని తీవ్రతా
ఖని యుపసంహరించదు జగత్ప్రళయాకృతియైన వేడిమిన్.

వేనుఁడు : భేష్! ముసలివాఁడవైనను నీవే పడుచువాఁడవు. ప్రళయ మార్తాండుఁడైన వేను నింత వ్యంగ్యముగాఁ దిట్టినవా డింతవరకు లేడు. నీమనుమని వ్యంగ్యము పసిగా నున్నది. నీకుమారుని వ్యంగ్యము మధ్యమముగా నున్నది. నీవ్యంగ్యమో ప్రౌఢమై రమ్యతరముగా నున్నది. ఓయీ! నీ పే రేమి?

ముసలిభట్టు : కాలభట్టు

వేనుఁడు : నీ కేమికావలయునో కోరుకొనుము.

ముసలిభట్టు : నాకు నీ చేతిలో మృత్యువు కావలయును.

వేనుఁడు : అది యడుగ నక్కఱలేదు. ఇదివరకే సిద్ధించినది. పాపము! నీవొక్కఁడవే యొంటరిగాఁ జనుటే నేల? నీకుఁ దోడిచ్చెదను. ఓరీ! కౌషీతగా! నీవు వీనికిఁ దోడుపొమ్ము.

అంగరాజు : ఓయోయి! ప్రళయసూర్యుడా? ఏల నోయి మాపాలా లింత మాడ్చి మంగిలమునఁ బెట్టెదవు?

> లోకబంధుఁడవు నీలోన లోకావలి
> కాకలంబడి మాడి కమరిపోమెకునట్లు
> భీకరాకృతి పూని బెట్ట నానాదిశా
> శ్రీ కావిరిగ మార్చ్చించెదకుబో పొగల్.

కౌషీతకుఁడు : ముసలిరాజున కింకను బిచ్చిపోలేదు.

వేనుఁడు : ఎవఁడురా అక్కడ వీరి నిద్దరి నురితీయుఁడు.

[ముగ్గురు నిష్క్రమింతురు]

అంగరాజు : అయ్యో! అయ్యో! నాకు బిచ్చియెక్కుచున్నది.

గౌతముఁడు : [ప్రవేశించి] ఆహా! ఇదియొక కృత్రిమ వ్యూహము.

అమరించి యెవ్వఁడే నొక మహావిషయంబుగఁ జెప్పజొచ్చె లో
కము బహుధా గతానుగతికంబుగఁ బోయెడి వానివెంబడిన్
దమతిమ యల్పబుద్ధులకు దాటినసంగతులే మృషల్ విచా
ర్యములు మనస్సచేతనని యచ్చటఁ బట్టను బుద్ధి కొంచెముల్.

అదికాదు కాని యీవిద్యాశాలలయందుఁగూడ విషయ చర్చలోఁగూడ వేనరాజునెడల ద్రోహముందునా? యథార్థ విషయవిజ్ఞాన మిచ్చుటఁగూడఁ గలుగరాదు కాఁబోలు సేబాసు! ఇచ్చుటఁగూడఁ గలుగరాదేమి? ఇచ్చుటనే కలుగరాదు.

శ్రీదము వేద మిచ్చట నశించవలెన్ సకలాక్ష దేవతా
వాదము లీ శ్మశానఘనవాటికలోఁ బొగవెళ్ళఁగావలెన్
పాదులు పెల్లగించి ఋషివాక్యము లింతయు నేర్పకుండ ప్రి
జ్ఞాదళినంబు ప్రవర్తకము సాఁగెను వేనుని పాఠశాలలన్.

ఓహో! వేదమాతా? తల్లీ నీకైన దయలేదా? దేశమంతయు వేనునియనుగ్రహ మెట్లు సంపాదింతునా యనియేకాని వేదమిట్లు నశించిన దని దిగులెవ్వరికిని లేదు. ఎవరిది! కాదుకాదు మాకున్నదనుచున్నారు ఓహో! గోష్పాదమాత్ర కేశబంధమాత్రపరిశిష్టవైదికత్వమువారా! స్వాములారా! మీరే సగము వేనునకు రాజ్యము పంచి పెట్టినది. మీకుఁ గేశబంధముల యందున్నంతప్రేమ

వేదములందు లేదు. విభూతిపిండికట్లయందున్నంత వాంఛ సత్యధర్మదయాశౌచములందు లేదు. బిళ్ళగోచీలయందున్నంత యపేక్ష పేదసాదలయందు లేదు. అయ్యో! వేదమతమును నిందించకుఁడు. గోచిపాతమత మనకుఁడు. దానియందు మీకుఁ దెలియని మహార్థములున్నవి. అది "ఆత్మవత్సర్వభూతాని" యన్న వాక్యార్థము సర్వ మానవుల హృదయములం దుండవలయు నన్న మతము! అడుగో! అంగరాజు! మొగమున వస్త్రము కప్పుకొని యుత్తరాభిముఖుఁడై పోవుచున్నాఁడు. ఏలనో? ఆహా! ఎంతవాని కెంతస్థితి వచ్చినది.

ఒక్కనాఁ డీ రాజు దిక్కామినీగండతలమందహాసవక్త్రకీర్తి
చిక్కవోయిన మోము పెట్టుక యీ రాజు నెచటికో తా నిట్టులేగుచుండె
ఒక్కనాఁ డీ ఱేఁడు మొక్కవోనిపరాక్రమస్ఫూర్తిజితదిశామండలుండు
సుక్కిపోయిన మేన నొక్కఁడై యీ రాజు నెచటికో తా నిట్టులేగుచుండె

ఒక్కనాఁ డీ ధరాపతి యుదధివేల
నొదిగిన ధరాసతికి ముణు, అలివు లోలయు
రతనమొలనూలు చెరివిన రసికవరాళి
ఒక్కఁడీనాఁడు చను నేఁటికో తెలియదు.

అయ్యో! అంగమహారాజా! ఏటికిట్లొక్కఁడవు దిగులుపడిన మొగముతోఁ బోయెదవు. [తనలో] ఈ రాజునకు మతిభ్రమణము కలిగినదని యీయన యడవులఁబట్టిపోయెనని చెప్పుకొనుచున్నారు. అంతఃపురమున నా కిన్నాళ్ళు కనంబడలే దీయన. చెలిమి కలనాళ్ళ వేనరాజీయన ప్రస్తావన

చేయనీయలేదు. ఆహా! యీముసలిరాజు రాజులేని నగరము వలె ధర్మము పరిత్యజించిన బుద్ధివలె కరుణాస్థానమై యిట్లు పోవుచున్న విరోధుల గుండెలుకూడఁ గరగుచున్నవి. అవునవును. విరోధులగుండెలు కరగునుగాని వేనుని గుండెలు కరుగుటలేదు. రాజా! నీపగతీర్చెదను. తీర్చెదను. తొందరపడకుము. కఠినమైన నా హృదయములో శుక్లాష్టమి రాత్రి సౌకుమార్యము తెచ్చినది. కాని నేటి పాఠశాలా వృత్తాంతము మరల నాయెడంద బిరుసెక్కించినది. అహాహా! వేదములు అపౌరుషేయములు కావఁట. అవి రెండువేల యేండ్ల క్రితము వ్రాయఁబడినవట. అబ్బో! వీరు క్రొత్త రీతగాఁ జదివిరఁట వేదములు! అందుచే వారికిఁ దెలిసినట్లు వేదార్థములు ఋషులకుఁ దెలియలేదఁట! ఛీ! ఛీ! అశ్రోవ్యములైన యిట్టిమాటలు వినికూడ నా మేనిలోఁ బ్రాణము లున్నవిచూడు?

ఇదె ప్రతిన పూనుచుంటిఁ ద్రయీమహర్షు
ముల కపార్థ మెవ్వఁడు చేసె ముసలిరాజా
నెవఁడు నిజరాజ్యపదవీబహిష్కృతునిగఁ
జేసె నాకత్తి యాశత్రుచేతఁ దడిసె!

ఈ ముసలిరాజుతో మాట్లాడుదునా! కాదు! కాదు! ఇతని గుండెలో నేనూలనో పుత్రిస్నేహము పచ్చిగా నుండ వచ్చును. నా నిశ్చయ మీసారి బెసగరాదు.

[నిష్క్రమించును]

అంగరాజు :

ఎవనికి వాఁడె రాజౌ జగమ్మందున
ఎవనిమార్గము వానిదే జగమ్మందునఁ
దవిలి పూర్వులప్రోవఁ దారాడెద నటంచు
భువిఁ జెప్పుటేలనో బుద్ధిమాలినవారు

వేనుఁడు : [ప్రవేశించి] ఈపిచ్చివాఁ డిట్లే తిరుగుచున్నాఁడు. ఇతనివలన నా కేమైననాపదరాఁ గలదా ! రాదు. జను లితని ననుసరించి జగమ్మున గల్లోలము తీసికొనిరారుగదా! ఇతనిని గారాగార బద్ధునిజేయ వలయునని యున్నది. వల దని యున్నది. నా ప్రయత్నము లితనివలన వృథాకావు గద! ఇతఁడు పూర్తిగాఁ బిచ్చివాఁడైనచో భయములేదు. కాని యితని పిచ్చిలో నేదో రహస్య మున్నది.

అంగరాజు :

ప్రతివాఁడు తన నాత్మభావముల్ ప్రకటించి
మతి పురంధరమంత్రిమాడ్కి నభినయించి
హితమైన లోకమ్ము లభినవశ్రీకముల్
గతిచేసితి నటంచు గంతులు వేసెను.

వేనుఁడు : ఇతనిపిచ్చి యీరీతిదైనచో భయము లేదు.

[నిష్క్రమించును]

అంగరాజు :

అస్మదంతరము మహాభారవహ మయ్యె
విస్మయంపడి నేను వెఱ్ఱినై తిరుగంగ
అశ్మకల్పమ్ము నాయంతరమ్మునఁగూడ
'అస్మి' యం చీ భార మావహింపఁగ నేల?

గౌతముఁడు : [ప్రవేశించి] ఈయనను వదలిపోనెంచియు నాలో నేదియో నన్నితనిని వదలిపోనీయలేదు. ఈయన మొగమ్ము చూచిన నేమో మహాలోచన చేయుచున్న ట్లున్నది. ఆ యాలోచన యేమో తెలియలేదు.

అంగరాజు :

పరగ నాలో బాడబజ్వాల యున్నది
తరుముచున్నది దాని దాఁగి యీ యనిలమ్ము
పెరిగి నాలో వహ్ని భీషణమ్మయిపోయి
మరగించి నాగుండె మాడ్చునో వెడలునో?

గౌతముఁడు : ఈ రహస్యమేమో? ఈ ముసలిరాజు మరల నీ వీధివెంటఁ బోఁబోవుచున్నాఁడు. నే నటు తిరిగివచ్చెదను.

[నిష్క్రమించును]

అంగరాజు :

అప్పుడే నానుండి యావిర్భవించి యీ
నిప్పు దిఙ్మండలాంధీభవద్ధూమమ్ము
గప్పుకొన్నది ఫాలగండభాగములందు
ముప్పుకొన్నది దిశామానినీచయమందు

వేనుఁడు : [ప్రవేశించి] ఇతనిని వదలిపో బుద్ధిపుట్టకున్నది. ఇతనిని నెమ్మదిగా రాజసౌధమునకుఁబిలుచుకొనిపోదునా?

అంగరాజు :

ప్రాగ్దిశాంగననేత్ర పారిజాతములందు
దిగ్దంతిదంత కాంతిస్ఫురణములందు

ద్రాగ్దీప్తిమున్నవ్యతారకాకృతుఁను
దృగ్దీప్తి నాయది తెచ్చె నెఱ్ఱఁదనాలు

వేనుఁడు : ఇతనిని సాధుమార్గమున రాజసౌధమున కాకర్షించెదను. [సమీపించి] అంగరాజా! నిన్ను పృథు చూడఁగోరుచున్నది.

అంగరాజు :

ఆ భాగ్యవన్మూర్తి కత్యభాగ్యుఁడ నాకు
నీ భూమిలో నింకయేమి సంబంధంబు
ప్రాభాతనూత్న నీరజకాంతికలికనుల్
నా భీకరాక్షి సంతాపమ్ము నెటు లోర్చు?

వేనుఁడు : ఇతడు వచ్చునట్లులేడు. [నిష్క్రమించును]

అంగరాజు :

ఓ నామనస్సులో నున్న బాడబవహ్ని
నే నెఱుంగకయుండ నీవు బాహిఁపోకు
ప్రాణముల్ నీమీఁదఁ బట్టియుంచితి నింత
కాని నన్నీ వెఱుంగక కకురించకు.

గౌతముఁడు : [ప్రవేశించి] ఈయనవద్ద నేదో మహారహస్యమున్నది. ఆ రహస్యబహిర్గమనము చేసినచో నేమగునో! ఈయనను నాగృహమున కాకర్షింతును. [సమీపించి] వృద్ధరాజా! ఎండకు వాసి కి ట్లేల తిరిగెదవు. నేను గౌతముఁడను, నాయింటికి రమ్ము. అచట నీ ముసలినాళ్ళు నేను నిన్ను బోషించెదను.

అంగరాజు :

నాయెదలోనున్న నామహాగ్నిజ్వాల
నాయెద మండించనైన మండించు లే
దాయెంబో తుదియాస లడఁగి తానే చచ్చు
నాయెంబో నీ కేల యడియాస లీ రీతి ?

గౌతముఁడు : ఇతనిని దీసికొని పోరాదు. కాని యీయన ననుసరించియే యుండవలయును.

అంగరాజు :

ఈ మహాగ్నిలతాప మే నోర్వఁగాలేను
ఏ మంచు కురియునో యిచట నన్నాశిలం
నా మనోవీథిలోనన యింకిపోయెంబో
ఏ మహాంభోధిలో నీతాప మణఁగునో?

[తెర]

# ఆ ఱ వ యం క ము

కోటముందు

పృథువు : మరల నీరాత్రి యంగరాజు పూవులన్నియును గోసికొనిపోయెను. ఛీ! అంగరా జేమిటి? మాపితృపాదులు తోటలోని పూ లన్నియుఁ దెచ్చికొనిపోయినారు. దేనికో? రాజ్యలక్ష్మీదేవియైన నా తల్లి సునీథాదేవిని బూజించుటకుఁ గావలయును.

భూదేవి : [ప్రవేశించి] పృథూ! పృథూ! మీ తండ్రి సునీథా దేవినే పూజించును. ఆమె నిజముగా రాజ్యలక్ష్మి కాదు. అంగరా జామెయందు రాజ్యలక్ష్మినారోపించుచున్నాఁడు. నేను నిజముగా రాజ్యలక్ష్మిని. నీ వా పూవు లన్నియుఁ దెచ్చి నన్నుఁ బూజించుము.

పృథువు : ఈ ధ్వని యెచ్చటిది? ఇచ్చట నెవ్వరును లేరే యీగోవుతప్ప. ఈ గోవు మాట్లాడియుండునా? గోవు మాట్లాడుట యేమి?

భూదేవి : ఓయీ! నేనే మాట్లాడినది.

పృథువు : నన్ను ఓయీ! అనెద వేమి? నేను కన్యనుకదా! నీవేనా మాట్లాడినది? ఓహో! యీ గోవెంత రమ్యముగా నున్నది. ఈమె మూపురము కైలాసశృంగమువలె శృంగ ములు గంగాసింధునదులవలె నీమె పొదుగు రాజనాలు

పండు సారవంతమైన పొలమునవలె నీమె పుచ్ఛము ధాన్య లక్ష్మికి వీచిన వింజామరవలె మనోహరముగా నున్నవి. నా కీమెను జూచినఁ గౌఁగిలించుకొని ముద్దాడవలె నని పించుచున్నది.

భూదేవి : రాజకుమారా! నీ కన్నులు, తెల్లని చూపులు మెరుపులై, నల్లని రెప్పలు చిరుమొగిళ్ళై, చూచినంత మేర దయావర్షములు కురిపించి సస్యకారకము లగుచున్నవి. నీ దీర్ఘబాహువులు పైఁడినాగేళ్ళవలె నున్నవి. ఇంక నీవు పొలాలు పండించుము.

పృథువు : ఈగోరూప నన్నుఁజూచి పురుషుఁడుగా భ్రాంతి చెందుచున్నది.

భూదేవి : నీవు నాయందు గోవుగా భ్రాంతి చెందుచున్నావు.

[నిష్క్రమించును]

పృథువు : ఈమె యెవ్వరో స్త్రీమూర్తి. ఇంతవఱకు గోమూర్తి వలె భాసించినది. తిరిగిపోవు నీమె పిరుందులు నదీ సైకతములవలె, సన్నని వలిపపుఁ బారలచేఁ దెల్లనినీటి సన్నని ధారలు ప్రవహింపించు చున్నట్లున్నవి. ఈమె నాయెందేమొ పురుషత్వ మావహింపించినట్లున్నది. నే నీమెను వర్ణించుచుంటిని. నాహృదయ మేమొ చివురాకు ముదురాకుగా మారఁబోవుచున్నట్లు తెలిసీ తెలియని యొక విచిత్ర పరిణామమును బొందుచున్నది.

ఒకవంక నవనీతసుకుమారమైయుండి యొకవంకఁ బ్రౌఢమై యుబుకఁజొచ్చె
ఒకవంక నిది కుదించుక సలజ్జాకమై విప్పారి యీవంక విస్తరించె
ఒకవంక బెదరులేటికి సాటియనిపించి యొకవంక నైశిత్య ముజ్జ్వలించె
ఒకచోఁ దనకుఁదాన యుండలేననిపించి యొకచో స్వతంత్రత కోహటించె.

వేనుఁడు : [ప్రవేశించి] ఇదేమి? పృథు పృథుగా లేదు. ఈమెలో నేదియో మార్పు కలుగుచున్నది. నాకు మిగిలిన బంధు వీమె యొక్కతెయే. ఇదికూడ నన్ను ద్రెంచుకొని పోవునా? పృథూ! పృథూ!

పృథువు : వేనా! వేనా!

వేనుఁడు : నన్ను ఇంక 'అన్నా' యని పిలచెద నంటివికదా?

పృథువు : కాదు; వేనా యనియే పిలచెదను.

వేనుఁడు : ఏమో! మగవానివలె మాటాడుచుంటివి.

పృథువు : స్త్రీలు నన్నుఁ గామించుచుండఁగా నేను మగ వాఁడను కాక స్త్రీ నెట్లగుదును.

వేనుఁడు : ఆ స్త్రీలు పురుషు లేమొ?

పృథువు : కాదు కాదు. పురుషులే స్త్రీలు. స్త్రీకి సీమంతిని యని పేరుకదా? పురుషులే సీమంతమును ధరింతురేని వారును స్త్రీలే.

వేనుఁడు : న న్నెక్కసక్కెయము లాడుచున్నావా?

పృథువు : నీ వేమి స్త్రీవా?

వేనుఁడు : నీవు పురుషుఁడవు.

పృథువు : నేను పురుషుఁడ నైనచో నీకు రాజ్యము లేదు.

వేనుఁడు : ఎందుకు లేదు? నేనే పెద్దవాఁడను.

పృథువు : అది నాకన్నులలోఁ గన్ను లుంచి చెప్పుము.

వేనుఁడు : పృథూ! నీవు పురుషుఁడవైనచో నేను నిన్నుఁ జంపెద నని నీ యూహ. వృద్ధరాజిట్లే యనుచుండెడివాఁడు. నీ కతఁడే యీ యూహ కలిపించినది.

పృథువు : [తనలో] మాతండ్రి నన్నితఁ డుండగా నెపుడు నిదురపోవద్దనెను. కాని, మొన్న రాత్రి యట్లు జరిగినది. ఏల యట్లుచెప్పెనో? ఒకవేళ నే నట్లు నిదురపోయినచో నా కాపద మూడు ననియెను. ఏమి మరి య ట్లేమియు జరుగలేదుకదా? నిదురపోవుచుండఁగా వేనుఁడు నన్నుఁ జంపునా? వేనునకుఁ దన చెలియలిమీఁదఁ జాలప్రేమ. అట్లు చేయఁడు.

వేనుఁడు : తమ్ముఁడా!

పృథువు : నేను నీకుఁ దమ్ముఁడనా? చెలియలినా?

వేనుఁడు : ప్రసంగబలముచేత నట్లు వచ్చినది. పృథూ! ఏమి యాలోచించుచుంటివి?

పృథువు : అంగరాజు మరలఁ బూవు లన్నియుఁ గోసికొని పోయెను.

వేనుఁడు : వానితో నేమి చేయును?

పృథువు : సునీథపాదములు పూజించును.

వేనుఁడు : సునీథ నతఁడు చంపలేదందువా?

అంగరాజు : [ప్రవేశించి] అతఁడు వేనునివలె రాక్షసుఁడు కాఁడు.

వేనుఁడు : పిశాచము.

అంగరాజు : నిజమేను. వేనుఁడు రాక్షసునివలె మనుష్యుల జంపుచున్నాఁడు. అంగరాజు వారికిఁ బ్రాణప్రతిష్ఠ చేసి వారలను బిశాచములను జేయుచున్నాఁడు.

ఒక పిశాచము కోటకొమ్మున నుండి చూచినది
ఒక పిశాచము కోటముందర నురుకు వెట్టినది
ఒక పిశాచము రాజుగదిలో నుండి పోయినది
యీ పిశాచము రాజుముందర నీసులాడినది.

వేనుఁడు : పృథూ ! యీ పిశాచములు మనల వెంటాడుట యిం కెన్నినాళ్ళు ?

అంగరాజు : క్రొత్త క్రొత్తపిశాచముల కే మయ్యెదవు ? ఈ ప్రాఁతపిశాచమునకే యింత బెదరెదవు.

వేనుఁడు : నన్ను మనుష్యపిశాచమువలె నిజమైన పిశాచములు బాధపెట్టలేవు.

అంగరాజు : నిజమైన పిశాచము లున్నందువా ?

వేనుఁడు : అవి లేవు. ఎట్లుండును ? ఉండవు.

అంగరాజు : అవి యున్నను నుండకపోయినను మనుష్యపిశాచములుమాత్ర ముండును. నేనుమాత్రము పిశాచమను కాను. పిశాచమనఁగా మాంసము తినునది. నే నవైన్యుల

మాంసము తినుచుంటినా? వేనుఁడు పిశాచము. లోకము నందలి జనులను జంపి వారిమాంసము తినుచున్నాఁడు.

వేనుఁడు : నేను వారిమాంసము తినుచున్నానా?

అంగరాజు : వారిమాంసమే వారిధనము, వారిమతము. అవి రెండును నీ వారగించుచుంటివి గాన వారిమాంసము తినుచున్నట్లే.

పృథువు : అందుచేతఁ బిశాచమవు నైనట్లే

వేనుఁడు : అయినచో నిన్నుఁ దినెదను, తినెదను

పృథువు : అమ్మో! నాకు భయమువేయుచున్నది.

[నిష్క్రమించును]

వేనుఁడు : పృథు పసిపిల్ల. నీవు దానిని భయపెట్టితివి.

అంగరాజు : నే నేల భయపెట్టితిని? పిశాచము భయపెట్టినది. నన్నుఁ జూచి యేల భయపడును?

మిగిలి మొగమున నాకు మిడిగ్రుడ్లు లేవు
ఎగచి మాంసపుఁదృష్ట యెడఁదలో లేదు
మిగిలి మొగమున నీకు మిడిగ్రుడ్లు కలవు
ఎగచి మాంసపుఁదృష్ట యెడఁదలోఁ గలదు.

[నిష్క్రమించును]

వేనుఁడు : ఛీ! ఛీ! ఈవృద్ధరాజు నెన్నిసారు లూరకే పోనిచ్చుచుంటిని. ఓయీ! నిన్నుఁ గారలోనుంచుట కింతసేపు పట్టదు. కాని పృథు అడ్డము వచ్చుచున్నది. సునీథ వెడలి

పోయినందుకే యామె చిక్కి సగమైనది. నిన్నుఁగూడఁ జెరలో నుంచితినా, ఆపసిపిల్ల లేతయెద యోర్చుకొనలేదు. లేకున్న నీయాట లింతగా సాఁగవు.

అదిగో! ప్రొద్దు క్రుంకుచున్నది. కత్తితో నరుకఁబడి రక్తసిక్తమైన శిరస్సువలె సూర్యుఁడు పశ్చిమశిఖరిఁ దోఁచుచున్నాఁడు. పిశాచములు తమముంగిళ్ళు నెత్తురులతో నలుకుకొన్నట్లు దిక్కులన్నియు నెఱ్ఱవడినవి. ఓహో! ఈడేగ యాకాశమునఁ దాను పక్షుల నన్నింటిని వేటాడి వేటాడి ప్రొద్దుక్రుంకుటచేఁ గనులు తెలియక సత్త్వముడిగినట్లు వ్రాలఁబోవుచున్నది. క్రమముగాఁ జీకట్లు హెచ్చుచున్నవి. ఇదిగో యీ గుడ్లగూబ పిశాచమువలె నా చెట్టుతొఱ్ఱలోఁ దొంగిచూచుచున్నది. నిజముగాఁ బిశాచములున్నవా? లేవు లేవు.

[తెరలో] ఉన్నవి ఉన్నవి.

వేనుఁడు: ఈధ్వని యేమి? ఇది యెచ్చటినుండి వచ్చినవి? ఎవరైన నిం డెందైన దాగియుండి యిట్లనుచున్నారు కావలయు. ఓరి! ఎవఁడురా నీవు? వేనునితోనా నీకుఁ జెరలాటలు.

[తెరలోఁ బెద్దనవ్వు]

వీఁడు నన్నెవ్వఁడో పరిహసించుచున్నాఁడు. నాయంతఃపురమున నాయాజ్ఞ యిట్లు తిరస్కరింపఁబడఁగా నేను బ్రతికి యెందుకు?

[తెరలో] మనుష్యుల ప్రాణములు తీయుటకు.

వేనుఁడు : మనుష్యుల ప్రాణములు తీయుటకా? ఓసీ! యెవఁడురా నీవు! వీఁ డెవఁడో వెదకెదను.

[కోటపైనుండి ధ్వని] : వెదుక నక్కరలేదు. తలయెత్తి చూఁడుము. నేను వినీతభట్టు తలకాయను. నేను పిశాచము నైతిని. నేను నా మనుమఁడు నా అల్లుఁడు నా వియ్యంకుఁడు మే మందరము పిశాచముల మైతిమి? నీ కొఱకేసుమా! నీ రాజ్యమును నిన్ను నాశనము చేయుటకు. నీ మనస్సులో రాక్షసుల నాడించుటకు. పిశాచములు లేవు! లేవు!

[పైనుండి వినీతభట్టు ప్రవేశించును]

వినీతభట్టు : రాజా! నీకు వైతాళికగానము చేసిపెట్టుదునా? రాజా! ప్రొద్దు క్రుంకినది. ప్రొద్దు క్రుంకినది.

మొగిమున మసిపూసి ముండితమైన
సిగపైన బొమికలచిన్నారిపేరు
తగిలించి మిడిగ్రుడ్లుదాత్తమై మెరయు
ౘగిలి నాట్యముసేసె రాత్రిపిశాచి

జాజా! రాజ! నాకవిత్వము చూచితివా! కులక్రమాగతమై సంప్రదాయము ననుసరించి వచ్చిన కవిత్వము నీకు రుచిగా లేదు. ఇదిగో యీ కవిత్వము చూడుము. నేను పిశాచము నైతిని. ఇదిగో పిశాచకవిత్వము వచ్చినది. నీవును పిశాచమవే కాన నీకీ కవిత్వము చాల బాగుండవలయును.

వేనుఁడు : వీఁడు సర్వథా వినీతభట్టువలెనే యున్నాఁడు. చని పోయిన వినీతభట్టునకుఁ బ్రాణము లెట్లు వచ్చినవి?

వినీతభట్టు : అంగరాజు నాకుఁ బ్రాణములుపోసెను. అది నీ కిందాక చెప్పెనుకదా? ఇంకను దెలియలేదా?

వేనుఁడు : ఆ! సరిగా అంగరాజిదే మాట యనెను. ఆ సంగతి వీని కెట్లు తెలిసినది?

వినీతభట్టు : పిశాచములు మనుష్యపిశాచములవలె నేకదేశ జ్ఞానములుకావు. మనుష్యపిశాచము తనకు సర్వజ్ఞత యున్న దనుకొనును. తన కున్న కించిద్ జ్ఞానమునకే తబ్బిబ్బులగును. ఓసి ఓసి మనుష్యపిశాచమా! నీ జ్ఞానము కొద్ది. నీ జ్ఞానముయొక్క కించిత్త్వమే నీకు నాశము తెచ్చుచున్నది.

వేనుఁడు : ఛీ! ఛీ! నీ వ్యర్థోపన్యాసము లింక నాపి నా మార్గమునుండి తొలఁగుము.

వినీతభట్టు : నేను నీకుఁ గైవారము చేయవచ్చితిని. నీ చేత నురితీయించుకొన వచ్చితిని. రాజా! ఇదిగో కైవారము చేయుచున్నాను. ఓహో! వేనమహారాజా! ఓహో! పిశాచబంధూ! ఓహో మృత్యుదేవతాసహధర్మచారి!

మాంసములతో నెత్తురులతో మాసియున్నవి జనుల మెదడులు
అంసములు ఖండించి కండలు నావపోఁపులు పెట్టియున్నవి
ప్రాంశువులు తోడకండ లున్నవి, వర్జనము చేసిరి, పిశాచులు
దంశములు నంజుకొని నెత్తురు ద్రావుచును రావయ్య వేనుఁడ!

వేనుఁడు : ఛీ ! ఛీ ! నన్ను వదలిపెట్టి పొమ్ము. లేదా ! యీ కత్తితో నీ కుత్తుకవరకు రెండుగా నరకెదను.

వినీతభట్టు : [పకపకనవ్వి] ఓయోయి! శూరవరాళి! ఓయోయి! పరాక్రమార్జిత త్రిలోకీ! ఓయోయి! దోర్దండకౌక్షేయ సంరక్షితా క్షీణవర్ణాశ్రమాచార ధర్మప్రభా వాభిరామా ! ఓయోయి! అభినవమృత్యూ! చచ్చిపోయిన శవమును నరకెదవా ? నరుకవద్దు ! నరుకవద్దు ! నన్ను నరకినచో నొకవేళ నీ కీర్తులు దిగంగనల చీరలయంచుల నద్దుకొనునేమో ? వారి కన్నుల కాటుక కానిపించదేమో ?

వేనుఁడు : వీఁడు పిశాచమైకూడ రమ్యముగాఁ బ్రసంగించుచున్నాఁడు.

వినీతభట్టు : అది పూర్వవాసనలే. నన్ను చంపవా! చంపు చంపు.

వేనుఁడే : ఇదిగో నరకుచున్నాను.

[కత్తివిసరును, వినీతభట్టు - నిష్క్రమించును]

వేనుఁడు : ఓహో! ఇది విచిత్రముగ నున్నది. పిశాచములు నిజముగా నున్నవా యేమికర్మము! ఇదియేదో భ్రాంతి. ఈవృద్ధరాజేదో తంత్రముచేసి పోయినాఁడు. వీని నీసారి వదలిపెట్టరాదు. ఇందు వృద్ధరాజు తంత్రమే మున్నది ? నామనస్సే యూరక భ్రాంతి పెంచుకొన్నది.

ముసలిభట్టు : [ప్రవేశించి] ఓయీ ! మిథ్యా వాది ! మనసు భ్రాంతి పెంచుకోలేదు. మే మున్నాము. మాది గాలి యాకారము. నీ కత్తివిసరుట లిచ్చుటఁ బసికిరావు.

వేనుఁడు : నీ వెవ్వరవు?

ముసలిభట్టు :

ఒకపిశాచము కోటకొమ్మున నుఃమి చూచినది
ఒకపిశాచము కోటముంగర నురుకు వెట్టినది.

నేను విపీతభట్టు వియ్యంకుఁడను.

వేనుఁడు : నా కీ భ్రాంతి విడిపోవునట్లులేదు.

ముసలిభట్టు : ఇది భ్రాంతికాదు, ప్రత్యక్షము. ప్రత్యక్షము దాటి యేదియు లేదన్నవారికి మేము భ్రాంతి. ఓయీ! నీకన్నులకన్న నీచెవు లుత్తమములు. నీ బహిరింద్రియ ములకన్న నీయంతరింద్రియము లుత్తమములు. బహి రింద్రియములు గ్రహించలేని నంతరింద్రియములు గ్రహిం చును. బహిరింద్రియములు గ్రహించలేనివి నీవు లేవందువు. అంతరింద్రియములు వాని నున్న వనుచున్నవి. అంతరింద్రి యములకుఁగూడఁ దెలియనివి లేదనువాఁడొకఁ డుండునేని వాఁడు చెడెఁగాక నవియు నున్నవి. నీ జ్ఞానము కొద్ది దైనప్పుడు ఒకటిలేదని నీవెట్లనఁగలవు ! ప్రతిదియు నుండ వచ్చునని చెప్పుట తేలికగాని, లేదని చెప్పుట యసాధ్యము కదా ?

వేనుఁడు : ఎవరితో నీవాదన ?

ముసలిభట్టు : నీతో ? నాకన్నులకు మించినది లేదని వాదించు వెఱ్ఱిమొగముతో ! మనిసి నురితీసినంతనే వాఁడు చచ్చెనని తలఁచు దేబెమొగముతో! అశాశ్వతమైన శరీరమును నరకి, బాధపెట్టి, గెలిచితి నని యుబలాటపడు ప్రేతాకృతితో! ఓయీ! ప్రత్యక్షవాదీ ! ఓయీ ! రాజ్యాభిలాషీ ! ఓయీ ! ధనమదాంధకారీ !

మనుజాలపుఱ్ఱెలు తోరణములుగా మలచితి రాజా! కోటకొమ్మలను
చనవు పురాఋషిమార్గములందు పిశాచము వొదుపయేమి? నరేంద్రా!

పిశాచమవైనచో మావలెఁ గోటగొమ్మలఁ గోటముందర రాజుగదిలో రాజుముందర నృత్యము చేయవచ్చును. మాంసమున కేమి? దానిరుచి మాకన్న ముందర నీవే యెఱుఁగుదువు.

వేనుఁడు : ఓరీ! ని న్నదే నరకు చున్నాను.

ముసలిభట్టు : [పెద్దనవ్వు నవ్వును]

వేనుఁడు : ఆహా! ఏమి యీ తిరస్కారణ! ద్వ్యాషీతకా! ద్వ్యాషీతకా! ఎచ్చట నుంటివి?

ద్వ్యాషీతకుఁడు : [ప్రవేశించి] ప్రభూ! ఇచ్చట నుంటిని.

ముసలిభట్టు : [నిష్క్రమించును]

వేనుఁడు : ఓయీ! నీ వా పోవుచున్నమనిసిని జూచు చుంటివా ?

ద్యాషీతకుఁడు : ప్రభూ! ఎవరు పోవుచుండిరి? ఎవరులేరే!

వేనుఁడు : నీ కెవరును గనఁబడుటలేదా?

ద్యాషీతకుఁడు : లేదు.

వేనుఁడు : ద్యాషీతక! నే నన్నములో నేఁడేమి వేసికొని తింటిని?

[తెరలో - మనుష్యమాంసము]

వేనుఁడు : మనుష్యమాంసమా! ద్యాషీతకా! నీ వా మాట వింటివా?

ద్యాషీతకుఁడు : ప్రభూ! నా కేమియు వినంబడలేదు.

వేనుఁడు : సరికాని! ఓయీ! దయ్యము లున్న వని నీకు నమ్మక మున్నదా?

ద్యాషీతకుఁడు : మా అవ్వకథలనిండ దయ్యములే. దయ్యములే లేకున్న నన్ని కథ లెట్లుండును?

వేనుఁడు : ఓయీ! ముందు నడువుము.

[తెర]

## ఏ డ వ య ం క ము

[కోటముందు]

గౌతముఁడు: కౌషీతకా! వేనుఁ డున్నాడా?

[ద్యాషీతకుఁడు ప్రవేశించును]

కౌషీతకా? వేనుఁడున్నాడా? ఓయీ! మారుమాటాడవేమి? బాధిర్యము ప్రాప్తించెనా? రాజశీవి రాజును వదలి నిన్నుఁ జేరినదా? కౌషీతకా! నన్నె అడుగుచున్నది?

ద్యాషీతకుఁడు: నేను కౌషీతకుఁడను కాను.

గౌతముఁడు: ఓరీ! కౌషీతకా! పిచ్చియెక్కినదా యేమి నీకు? నేను కౌషీకుఁడను కాదనెద వేమి? ఎవనికి వాఁడు నేను కాదనుట యిదొక వేనుని క్రొత్త సిద్ధాంతమా యేమి?

ద్యాషీతకుఁడు: నిజముగా నేను కౌషీతకుఁడను కాను.

గౌతముఁడు: పాపము వీని కున్మాదము కలిగినట్లున్నది. అవు నవును. వీఁడు తప్పక సేవించువాఁడు. ఈ వేనుని దౌర్మార్గ్యమువలన వీనికి మతిభ్రమణము కలిగినది. ఓయీ! నీవు కౌషీతకుఁడవు కావునరే! మరి నీ వెవరవు?

ద్యాషీతకుఁడు: నేను ద్యాషీతకుఁడను.

గౌతముఁడు: మఱి కౌషీతకుఁడు నీబురిలో నుండెనా యేమి?

ద్యాషీతకుఁడు: కాదుకాదు, వానిబుర్రలోననే వాఁడున్నాఁడు. అదుగో చూఁడుము. ఆకోటద్వారమున వానిబుర్ర వ్రేలాడు చున్నది.

గౌతముఁడు : [చూచి] ఆ ! ఏమిది ? కౌషీతకునిఁగూడ వేనుఁ డురితీయించెనా ? ఆహా ! పాపబుద్ధి! అచ్చముగాఁ గౌషీతకునివలె నుంటివి ? నీవెవ్వరవు ? నీను వానికేమైన సంబంధ మున్నదా ?

ద్వ్యాషీతకుఁడు : ఆ రాజద్రోహితో నా కేమియు సంబంధము లేదు.

గౌతముఁడు : అట్లనా ? వాఁడు రాజద్రోహి కాకపూర్వము ?

ద్వ్యాషీతకుఁడు : అతడు నా కన్నగారు.

గౌతముఁడు : ఓకీ ? దుష్టరాజసేవకా ! నీ రాజును బిలుచు కొనుము. వానితో మాట్లాడెదను. వేనా! వేనా! ఇటు రమ్ము.

వేనుఁడు : [ప్రవేశించి] గౌతమా ! ఏమీ ?

గౌతముఁడు : వేనా ! ఇప్పటికి రాజద్రోహ్యము పూర్తియైనది.

వేనుఁడు : ఎప్పటికి ?

గౌతముఁడు : ఇట్టి రాజసేవకుఁడు లభించునప్పటికి.

వేనుఁడు : అతఁడు రాజభక్తి పరాయణుఁడు.

గౌతముఁడు : అట్లనా! నీ దుర్మార్గత క్రమ క్రమముగా వృద్ధి పొందుచున్నది. ఇటు చూడుము, మనుజు లెక్కువమంది బుద్ధిహీనులు. జనులందఱను సమానమైన యుత్తమబుద్ధి యెట్లుండును ? సంస్కార భేదముచేత నిట్టివారును బరపీత్యయనేయబుద్ధులు లోకమునఁ గలుగుచునే

యుందురు. వీరిని దుష్టులిట్లుపయోగించుకొనుచుందురు. వారియవివేకము నాధారము చేసికొని రాజు స్వలాభ పరాయణుఁడు కాఁగూడదు. అందరు వివేకవంతులైనచో రాజుతో నవసరమేలేదు. వివేకు లెట్లును సన్మార్గమందే పోదురు. రాజు అవివేకులనుగూడ సన్మార్గమున నడిపించుటకే రాజు. ఆరాజు అవివేకుల యవివేకముమీదఁ దన రాజ్యము నిర్మించుకొనెనా యది యేటినడుమ నిసుకలమీద మేడకట్టుటవంటిది.

ఏవేళన్ బయికొండకొమ్ములను ప్రావృణ్మేఘముల్ క్రమ్మి వ
ర్షావిద్యోతితవిద్యుదుల్లసితమై యాకాశ మాసారధా
రావిస్ఫారతరంగభీకరవిచిత్రావర్తఘుష్యత్పయ
శ్శ్రీవేణీపరిధూతయై చనెడునో చింత్యంబుకాదా? నృపా!

[తనలో] ఈ యవివేకిపక్షము నే నవలంబించి యవివేకిగాఁ గనంబడుచున్నాను. అయినను ఈ దీనజీవిసంగతి యెట్లుపేక్ష చేయుదును? అన్నిఁటికి నొక్కటియే మందు. అది వేనుని జీవితము.

[ప్రకాశము] వేనా! నీ కొక్కటి చెప్పుచున్నాను విను. లోక మింక నూరకుండదు. జగమ్మునను నొడలు మండి పోవుచున్నది. ప్రజాశక్తి నీ వెఱుఁగవు. అది ప్రళయ వలె దోకచిచ్చువలె నంటుకొన్నచోట నెల్ల సురసుర లాడిపోవును. ఏల వృథాగా స్వార్థాభిజాసివై లోకమును బీల్చి పిప్పి చేసెదవు.

వేనుఁడు : [కోపమునవ్వు]

గౌతముఁడు: రేపురాతిరి రెండుజాములవేళ వచ్చి మరల నిన్నుఁ గలసికొనెదను.

వేనుఁడు: సరే [నిష్క్రమించును]

గౌతముఁడు: వేనా! వేన!

వేనుఁడు: [వచ్చి] ఏమి?

గౌతముఁడు: నీవీ మార్గమునుండి తిరిగి లోకహితపథమునఁ బోవుటేమైన నున్నదా? లేదా?

వేనుఁడు: ఇంతకన్న లోకహితమైన మార్గములేదు.

గౌతముఁడు: సరే! [వేనుఁడు-నిష్క్రమించును]

గౌతముఁడు: వేనా! వేన!

వేనుఁడు: [వచ్చి] మరలనేమి?

గౌతముఁడు: నన్ను నీవు జనసామాన్యమువలె నేల శిక్షించ రాదు. నేను నీకుఁ బరమవిరోధిని. నీ దేశమున నిదివరకే పెద్ద విప్లవము లేవఁదీసితిని. నన్ను వదలిపెట్టినచో నీ రాజ్యమునకుఁ జేటు తప్పదు.

వేనుఁడు: [మౌనము]

గౌతముఁడు: ఓయీ! నావలన నీకు వినాశము రానున్నది.

వేనుఁడు: [మౌనము]

గౌతముఁడు: ఇంక నా కేమియుఁ దప్పులేదు. ఇతనికిఁ బ్రాహ్మ శక్తి తెలియుటలేదు. ఋషుల మతిప్రతిభ యర్థమగుట లేదు. ధర్మహానివలనఁ గలుగు మహాపద యవగతమగుట లేదు.

[ తెరలో ]

ఓయీ! వేనమహారాజా! ప్రొద్దుగ్రుంకినది. దివాంధముల సంచారము మిక్కుటమైనది. చీకటిలోఁ బోవుజనులకుఁ బ్రతిదారిలో నెదురుగాఁ గూయుచు కాగడాలవలె వెలుగు రెండు కన్నులతో బాట కనఁబడనీయని యీసల్లని సజ్జీవ జంతువులవలన బాధ కలుగుచున్నది. రాజా! ఏమి నాగరకతయోయి! ఎదుటివారికి దుశ్శకునము, కన్నులలోదుమ్ము, భీకరాకృతి. ఈ దివాంధములను రెక్కొలిపితివి దేశము మీఁదికి.

నల్లనితాసితా ల్పరచినావు బళే! బళె! దిక్సతీముఖో
త్ఫుల్లసరోజమండలివిముగ్ధరుచుల్ పిహితంబులై చనన్
దెల్లనిరేకయైనఁ దొలిదిక్కునఁ గన్పడకుండ నీ ప్రభల్
సెల్లెనురా! మొగిళ్ళు విరచించితి వార్షిక బిందుహీనముల్.

బళీ! బళి! మా వేనమహా రా జే మనుకొంటివి?

సాక్షాన్మృత్యువు, వానికిన్నొబ్బరు మహాక్షామాగ్నిధూమంబు, లో
కక్షోభకృతి వానితేఁగవు, సాకారమ్ము దుర్వ్యాధి వాఁ
డీ క్షోణీస్థలి ధూమకేతువు మహాతృష్ణాపరీవాహ మా
లాతుభ్యత్పుటునక్రమూర్తి మృతియేలా! కల్గు నవ్వానికిన్.

వేనుఁడు: ద్వ్యాషీతకా! ద్వ్యాషీతకా!

ద్వ్యాషీతకుఁడు: [వచ్చి] ఏమి! ప్రభూ!

వేనుఁడు: ఈపిశాచములు నన్ను వదలిపెట్టవా ఏమి?

ద్వ్యాషీతకుఁడు: స్వామీ! ఈమె వినీతభట్టుముసలివియ్యపురాలు. తన భర్త, కొడుకు, మనమడు చనిపోయిన దుఃఖము తనప్రాణములతోఁ బాపుకొను నట.

వేనుఁడు : అట్లనా ! ఓయీ ! దీనిని బిశాచమును కానీకుము. దీనిని దీసికొనిపోయి కోటయవ్వలిచీకఁటిగదిలో నుంచుము. వేళకు భోజనము పెట్టుము. దానిబంధువులు చనిపోలేదు, బ్రతికియే యున్నా రని చెప్పుము.

ద్యాషీతకుఁడు : [నిష్క్రమించును]

గౌతముఁడు : వేనా !

వేనుఁడు : ఏమి ?

గౌతముఁడు : తక్కినవారందరు పిశాచములై నారా యేమి ?

వేనుఁడు : నేనే పిశాచమను. నాకు వేరే పిశాచములెందుకు ? నే నింకఁ బోదునా? నాకుఁ బని యున్నది. నీవు రేపు రాత్రికి వత్తువుకదా ! మరచిపోకుము. (నిష్క్రమించును)

గౌతముఁడు : ఇతఁ డెన్నఁడెఱుఁగని భయ మేదియో యితని నావరించినది. అది యేమైయుండును ? వేనుని యీ భయమునకు హేతువేమి ? హిమవంతమువంటి ధైర్యము కల వేనుఁడు భయపడెనా ? కారణ మేదియో పెద్దదే యుండవలయును.

[ తెర ]

# ఎనిమిదవయంకము

అంగరాజు :

మేటిచెట్లడవిలో మెరుపులం బుట్టి
తాటిమొవ్వలు తగిలి ధరణికి డిగ్గి
లేటికన్నులలోన లీలగా నొదిగి
యేటియిసుకలనీళ్ళ లెగచి పండినవి.

గౌతతముఁడు : [ప్రవేశించి] ఈవృద్ధరాజు నాకంటికిఁ గనపడి నంతలో మాయమగుచు నన్ను రెన్నాళ్ళుగాఁ దనవెంటఁ ద్రిప్పుకొనుచున్నాఁడు. ఇతని రహస్య మేమో తెలిసినది కాదు.

అంగరాజు :

స్వాతిచల్లనివాన జలజలా కురిసి
ప్రీతి ముత్తెపుచిప్ప పిలపిలా విరిసి
తొలుత సంద్రమునడుమ దూరె నేగాని
వెలువడి ముత్తెమ్ము వెలిగించె దెసలం.

గౌతముఁడు : [సమీపించి] మహారాజా! ఎండకు వాన కిట్లు బడలిపోయెదవు. నీవయసునాఁటి నర్మసఖుఁడు నాముసలి తండ్రి నిన్నుఁ జూడగోరుచున్నాఁడు. నీ తల నా యింటి నీడలోఁ జల్లపడనిమ్ము.

అంగరాజు :

పఱచి తొందరపడి పరిణతి రాని
చిఱుతముత్తెముచిప్ప ఛిన్నమ్ము చేసి
అఱుత బాష్పపుఁగన్ను లానుకో నేల
పిఱుద నిశ్వాసమ్ము విడువఁగా నేల ?

గౌతముఁడు : రాజశేఖరా! లోకము మలమల మాడిపోవు చున్నది. జగమ్ము నిల్చుటకు వీలులేదు.

అంగరాజు : నా కేమియు నెండభయములేదు. ఒకరికి మాత్ర మెందుకు? వేసఁగి వెనుకపట్టినది.

జలధిలో నకును వర్షపు నల్లమొగిలు
పరువెత్తెఁ దలయెత్తి పరికించి చూఁడు
తరకసన్నవిగాలి తరిమికొట్టినది
ధరణియంచుల నది తారులాడినది.

గౌతముఁడు : మహారాజా! మరలఁ గలిసికొనెదను.

[నిష్క్రమించును]

అంగరాజు :

జిలుగువెన్నెలలలోఁ జీకటుల్ కలవు
తొలిపాటలో మౌనములు కొన్నికలవు
మలఁగి యూహకుఁ జిక్కు మదిరాక్షితొలిప్రేమ
వెలవాకలోఁ గొన్ని చిక్కులు కలవు.

భూదేవి : [ప్రవేశించి] ఈ వృద్ధరాజులోనుండి నామూర్తి నే నుపసంహరించుకొనవలయును. ఇతఁ డింకను దేజో మూర్తిగా నున్నాఁడు. వేయికళలలో నారునాళ్ళనుండి యారువందల కళ లుపసంహరించుకొంటిని. నెలయేటి తనమువదలి చిఱుకాల్వతనము రాజు తన మాటలలోఁ దెచ్చుకొన్నాఁడు. ఇంకఁ దక్కినకళలుకూడ రాచినఁగాని యీయన రహస్యము వదలడు. ఈలోపుగా నామూర్తి పృథురాజునం దారోపింతును.

అంగరాజు :

పృథునేత్రములలోన వెన్నెలల్ కలవు
వధువుకన్గొనలలో మధురిమల్ కలవు
విధుమండలములోన వెన్నెలల్ కలవు
మధుబిందువులలోన మధురిమల్ కలవు.

[నిష్క్రమించును.]

భూదేవి : ఈ రాజకుమారునిమీఁద నామనస్సు పొదువుకొను చున్నది. ఎందరెందరు రాజులైరి. కాని యితనియందుంబలె నామనస్సు మరొకనియందు రక్తిపొందనే లేదు. నన్నితఁడు దివ్యవాహినులలోఁ గ్రుంకువెట్టించును. నాయందు రాజనాలు పండించును. నా శరీరమంతయు సస్యపులకితము చేయును.

పృథువు : [ప్రవేశించి] నా యెదుట నీ గోమూర్తి మరల భాసించుచున్నది. ఈమెనుఁ జూచినకొలఁది నాలో నేదో యననుభూతపూర్వమైన యొక మధురభావము కలుగుచున్నది. నే నొక పశువులకాపరినై యీ గోవును బచ్చికబయళ్ళలో మేపి చల్లని టేకుటడవిలోఁ బ్రవహించు సెలయేళ్ళలో దాపి నల్లకానుగుల నీడల శ్రమ పొందు రోమంథవేళఁ జోపి కాచెదను. ఈ గోవు నాయందు బద్ధానురాగవలె నన్ను వదలి పోవుటలేదు.

భూదేవి : రాజకుమారా! నిన్ను నేను వలచి వచ్చితిని. నీవు నన్ను సాకెదవా? నాయందు నవక్షీరములు కురిపించి

ధరణిజనులకుఁ బ్రాణదానము చేసెదవా? వెడంద యగుచున్న నీ యెదురొమ్ముపై నన్ను విశ్రాంతి పొందసత్తువా?

పృథువు : ఈమె మరల నన్ను రాజకుమారా! యనుచున్నది. నేనీమెకంటికిఁ బురుషునివలెఁ గనంబడుచుంటిని కావలయు. నాయందు మరలఁ దొల్లింటి వికారము కనఁబడుచున్నది. నీ పేరేమి?

భూదేవి : వసుంధర.

పృథువు : ఏమిచక్కని పేరు! నీ నామాక్షరములు నాచెవిఁ బడినంతనే నాయాత్మలోఁ బులకలు కలుగుచున్నవి. నీకు నాకు నేదియో పురాసంబంధ ముండవలయును. నీవు నా తాత తండ్రుల మందలలోఁ బెద్దయావువా?

భూదేవి : నాకుఁ బూర్వము పెద్దతనమున్నను నీకొఱకు మరలఁ బసితనము పొందితిని.

పృథువు : నీ పసితనము రమ్యముగా నున్నది.

విదియచందిరుని యొప్పిదమైన శృంగసుందరమైన శృంగసుందరత మెరసి
మలచి గాలులు తీర్చు తెలిసైకతముల పిండులకొసగా గంగడోలు తనరి
పడు నీగ్రవాలినఁ గాలు జారెడునట్లు మిలమిలల్ తొలిగిన మేను పొలసి
అందాలు పిసుకు సోయగము చిందించెడు పొలుపైనచిన్నారిపొదుగు కలిగి

మృదునవాకృతి పొంగు సస్యేందిరవలె
కడగి మూర్తి కొగ్గిన పాలకడలివోలె
దాగియుండి నేఁడు బహిర్గతంబు వడిన
నా మనోవాంఛవలెఁ దోఁచినావు నీవు.

[భూదేవి — నిష్క్రమించును]

పృథువు : ఈమె తిరిగిపోవుచు మరల స్త్రీవలె గోచరించుచున్నది. ఆహా ! ఈమె యేమి మాధుర్యసీమ !

ఈ పొంకాగ్రైనవేణి తలపెట్టిన చిన్నిపతాక, వంగి యా
మూపులు గీముగీతవళివుంబస లోఁ గుదియించుహద్దు ని
ద్దాపిరుమల్ స్పృహాజలధి తార్చినదీవులు జంఘు లానను
ద్రచ్చిపరిపాకమా పొలము చిత్తము పండినపంట వెన్నులుల్.

అరే! సరిగాఁ బురుషునివలెవర్ణించుచుంటిని. ఈమె యేమొ మంత్రకత్తెవలె నన్ను మార్చుచున్నది. నన్ను జూచిన నాకె యాశ్చర్య మగుచున్నది.

తాఁకిన నాదుకంట నిశితంబులు చూపులు నిన్నలేవు వాం
ఛారమణీయముల్ మధురసంబులు నాయెన నిన్నలేవు ప్ర
జ్ఞారభసంబు నా మనసుసంపత్క్రొత్తలు నిన్నలేవు నా
మారుపుతోన నాతలఁపు మాటికి మాటికిఁ జీరసాఁగెడిన్.

ఈ గోరూపస్త్రీని నేను వదలలేను. దీనిని గైనసము చేసికొని రాజనాలు పండించెదను. మధుక్షీరములు పిదికెదను.

వేనుఁడు : [ప్రవేశించి] పృథూ ! తోటలోని పూవు లీ నాఁడు పోలేదు.

పృథువు : సగము పోయినవి. సగ మున్నవి.

వేనుఁడు : ఆ సగము నంగరా జెత్తుకొనిపోయెనా ?

పృథువు : ఇంక నంగరాజు నెత్తుకొని పోనీయను.

వేనుఁడు : ఎందుచేత ?

పృథువు : నాకుఁ గావలయును. నే నొక చిన్ని యావును జూచితిని. ఈ పూవులన్నియు గుచ్చి యాయావు మెడలో

వేసెదను, కొమ్ములకుఁ జుట్టెదను, కాళ్ళకుఁ గట్టెదను, మొగమున వ్రేలాడఁ దీసెదను.

వేనుఁడు : పృథూ ! నీ మనస్సులో నేదో కోరిక చెల్లరేగుచున్నది.

పృథువు : ఆ యావునుగూర్చిన కోరికయే. ఆయావు నాకు గావలయును. దానికై యేమైనను చేసెదను. అంత కంతకు నామనసు చివరలు బిరుసెక్కుచున్నవి.

నా కీ యాడవేషము బాగుగా లేదు. ఆ యావును గాచుకొనుటకు నేను మునికోల పూని యడవులవెంటఁ బోయెదను. అప్పుడు నా కీ స్త్రీవేషము తగదు.

వేనుఁడు : పృథూ ! నీకన్నులలో నైశిత్యము క్రొత్తగా రేకెత్తుచున్నది. నీవు మాట్లాడుచుండగా మునుపటివలెఁ గాక బాహువులు స్థూలములై కదలుచున్నవి. ఇంకఁ బురుషవేషమే నీకుఁ బాగుండును.

[పృథువు-నిష్క్రమించును]

వేనుఁడు : ఇదియొక చిత్రము. పృథు పురుషుఁడుగా మారునా యేమి ?

ద్వాఃస్థితకుఁడు : [ప్రవేశించి] ప్రభూ ! జనులు మృత్యువున కెదురుతిరిగిరట! సేనలతో మృత్యువు వారి నెదిరించి చెల్లాచెదరుచేసి రక్తము నదులు కట్టించి నీ కా వార్త కబురంపించెను.

వేనుఁడు : ఈసంగతి గౌతమునితోఁ జెప్పుము.

గౌతముఁడు :- [ప్రవేశించి] వేనా! నాకీ సంగతి యిదివరకే తెలియును. ప్రజలు నీ మృత్యువుపరాక్రమముచే బేలు పోలేదు. ఒకవేళ నిన్ను నీ సైనికులను గెలిచినను రాజ్య మరాజక మగునుకదా యని ప్రజలలో నిన్నుఁ జంపుటకు మనోధార్ఢ్యము రాలేదు. నీ తరువాత రాజ్య మెట్లో నిర్ణయింపఁబడెనేని నీ సైన్యము లాగవు.

వేనుఁడు : ఈ మాటలు నాతోఁగాదు, నీ ప్రజలతోఁ జెప్పుకొనుము.

గౌతముఁడు : అట్లే పోయి యంగరాజును వెదుకవలయును.

[నిష్క్రమించును]

వేనుఁడు : ధ్యాపీతకా! మృత్యువుతోఁ జెప్పుము. ఎదురు తిరిగిన ప్రజలశవములు వీథులనుండి తీయించవలదు. మరల నెదురుతిరుగువారి కర్మ మింతియే యని చెప్పుటకు వారిశవములు వీథులలోననే యుండవలయును. వారి గృహములలోఁ జొరఁబడి వారిస్త్రీలను బలవంతముగా సైనికులచేతఁ జెఱ పట్టించుమనుము. జనము భీతావహులై పోయి మరల నట్లు జరుగరాదు. ఇది మృత్యువుతో రహస్యముగాఁ జెప్పుము. [ధ్యాపీతకుఁడు-నిష్క్రమించును] వేనుఁడనగా నాకే యాశ్చర్య మగుచున్నది. అతఁ డెన్ని ఘోరకృత్యములు జేయుచున్నను అతని భ్రూలత ముడి వడదు. కోపముగా నతనినోటివెంట మాటరాదు. నాకీ స్థితి సహజమై పోయినది.

విసీతభట్టు : [ప్రవేశించి] పిశాచములకు ముఖరేఖ లాడవు. ఎందుకనగా వట్టిగాలిమూర్తులు గనుక. దూరమునకు మనుజులకు మనుజులవలె నవి కనంబడును గాని వానికి శరీరములు లేవు. వాని మొగములు దూరమునకు మొగ ములవలెఁ గానిపించును గాని యందు బొమికలు గాని మాంసముగాని లేవుకదా !

ముసలిభట్టు : [ప్రవేశించి] మరి తిన్నమాంస మంతయు నేమగును ?

విసీతభట్టు నల్లుడు : [ప్రవేశించి నవ్వి] వికృతపునవ్వుగా మారును. గూళ్ళుగా నున్న కన్నులలోననే పట్టును ఎంత మాంసమైనను.

వియ్యపురాలు : [ప్రవేశించి] వేనరాజీపిశాచములతోనే చచ్చిపోవును. పాపము ! వేనరాజును ముసలిపిశాచములు పట్టుకొన్నవి. వేనరాజున కెండిపోయిన ముసలిమాంసము రుచి యెక్కువ.

వేనుఁడు : ఈ ముసలిది వీరిలో నెట్లు కలిసెను ? ఇది బ్రతి కియే యున్నదికదా ! కౌషీతకా !

కౌషీతకుఁడు : [ప్రవేశించి] ఈపిశాచములు చాలవా? నన్ను గూడఁ బిలిచెద వెందులకు ? నీతో నారుగురము పిశాచ ములము. మన మొకసైన్యము. ఇప్పుడు మన మారు గురము విడివడినచో మృత్యువుసైన్యమును నాశనము చేయవచ్చును.

వేనుఁడు : వీడుకూడ పిశాచమయ్యెనా ! అయ్యో! పొర పాటున ద్యాషీతకా యనఁబోయి కౌషీతకా యంటిని.

కౌషీతకుఁడు : వేనా ! భయపడకు. నీవు పిలిచితివని వచ్చితిని; అక్కరలేకపోయిన వెడలుపోయెదనులే [నిష్క్రమించును]

వినీతభట్టు : ఓయిరాజా ! పిశాచలోకములోఁగూడ నీ దుర్మారత మానితివి కాదు. ఇచ్చటను భేదోపాయమేనా! కౌషీతకుని మాతోఁ గలియనీయవేల? మేము నందిపిశాచములము, వాడు శూద్రపిశాచము, నీవు రాజపిశాచమవు. వేనుఁడా! పిశాచములైనతరువాత నీ భేదములు కూడవు. ఋషుల మతములోననేగాని యీ భేదములు వేరే యెచ్చటను లేవంటివే? ఋషులమతము వదలి పిశాచమతము పొందితిమి. ఇక్కడను నీ భేదము వదలలేదే ?

ముసలిభట్టు : భేదము సర్వజంతువులయందు సర్వదేశములయందు సర్వలోకములయందు నిత్యమైనదే. వేనున కిది తెలియకనా ? అది యొక యుపాయము. అది భేదోపాయము. అది రాజనీతి.

వినీతభట్టునల్లుఁడు : పిశాచనీతి.

వియ్యపురాలు : నీతిలేనివానికిఁ బిశాచత్వము నీతి.

వేనుఁడు : ద్యాషీతకా !

[ద్యాషీతకుఁడు ప్రవేశించును. పిశాచములు నిష్క్రమించును]

వేనుఁడు : నీ కా గుంపు కనఁబడుచున్నదా ?

ద్యాషీతకుఁడు : ఏదో సుడిగాలి పోవుచున్నది.

వేనుఁడు : అవి యన్నియు దయ్యములు.

[ద్యాషీతకుఁడు – నవ్వాపుకొనును]

వేనుఁడు : నీకు నమ్మకము లేదా ? ఒకప్పుడు నాకును లేదు.

ద్యాషీతకుఁడు : చిత్తము.

వేనుఁడు : సన్నటి ముసలియాడవంది నేమి చేసితివి ?

ద్యాషీతకుఁడు : జనుల తిరుగుబాటు హడావిడిలోఁ జెప్ప మరచితిని. ఆమెను గోటచివరగదిలో నుంచి తాళమువేసితిని. మరల భోజనమువేళకు నన్నము తీసికొని పోతిని గదా, యామె మెడ కురిపోసికొని చనిపోయినది.

వేనుఁడు : ద్యాషీతకా! నీతో నొకమాట చెప్పెదను. ఎవరితో ననవు కదా ?

ద్యాషీతకుఁడు : అనను.

వేనుఁడు : [రహస్యముగా] ఆమెకూడ దయ్యమైనది.

ద్యాషీతకుఁడు : ప్రభూ ! తమ మనస్సు మనస్సులో లేదు.

వేనుఁడు : ఉన్నది. ఓరీ ! నాగదికి దారితీయుము. [పరిక్రమించి] ఇంక నీవు పొమ్ము. [ద్యాషీతకుడు – నిష్క్రమించును]

వేనుఁడు : ఒక పిశాచము రాజుగదిలో నొదిగి పోయినది ? ఈ యంగరాజుజోస్యము నన్ను బాధించుచున్నది. ఇందు పిశాచము లేదనుకొనెదను, ఉన్నచో రెన్నాళ్ళుగాఁ గన

బడదా? లేదు. లేదనియే యనుకొనెదను. ఇప్పుడెంత ప్రొద్దుపోయి యుండును?

శ్రీధరభట్టు: [పరివేశించి] జాము ప్రొద్దు పోయినది.

వేనుఁడు: నీ వెవ్వరవు?

శ్రీధరభట్టు: నాపేరు శ్రీధరభట్టు. నేను వినీతభట్టు మనుమఁడను.

వేనుఁడు: ఆహా! నీవిచ్చటఁజేరితివి. నన్ను నిదురపోనీయవా?

శ్రీధరభట్టు: కాదు కాదు నిదురపొమ్ము. నీకు జోలపాడెదను.

వేనుఁడు: శిశూ! నీవుకూడఁ బిశాచమవైతివా?

శ్రీధరభట్టు: నేను కాలేదు. పిశాచములను మిడిగ్రుడ్లుండును.

వేనుఁడు: నన్నాక్షేపించుచుంటివా?

శ్రీధరభట్టు: ప్రభూ! పల్లెటూరికుఱ్ఱవాఁడను. నా కాక్షేపము లేమి తెలియును? నేను చదువుకొన్నది వంది చదువు. అందులో స్తోత్రములే గాని యాక్షేపణలు లేవు.

వేనుఁడు: ఓయిశిశూ! చచ్చికూడ సౌమ్యమూర్తివి. నీ పసినెత్తురు, నీయమాయకపు నెత్తురు, నామొగమునఁ బూసికొంటిని. నీమొగము సుప్రసన్నముగ నున్నది. ఒక్కసారి నవ్వుము. విషాదపుటెండచేఁ దపించిన నా యెడందను నీ నవ్వు వెన్నెల చల్లదనము దెచ్చునను కొందును. ఒక్కసారి నవ్వుము.

శ్రీధరభట్టు: [నవ్వును]

వేనుఁడు : అయ్యో! ఇది యేమినవ్వు! ఇది పిశాచపునవ్వే! శస్త్రముచేయు వైద్యుఁడు రసి సిండినపుండులో వాడికత్తి గుచ్చినట్లు బుస్సు మని నవ్వితివి.

శ్రీధరభట్టు : మరల నవ్వుదునా ?

వేనుఁడు : వలదు ! వలదు ! నవ్వినప్పుడు నీ మొగము వికృత మగుచున్నది. మీ వాండ్రందఱకుఁ బిశాచత్వము పూర్తిగా వచ్చినది. నీకు నీ నవ్వులో మాత్రమే వచ్చినది.

శ్రీధరభట్టు : దీనికిఁ గారణము నాకుఁ దెలిసినది.

వేనుఁడు : ఏమిటది ?

శ్రీధరభట్టు : కారణము లేక నీవు నన్నురితీయింపగా నా వేళ నే నొక వికృతపు నవ్వుతోఁ జనిపోయితిని.

వేనుఁడు : ఆహా !

శ్రీధరభట్టు : రాజా ! జెదరిపోకుము. నీకు నేను కైవారము చేసెదను. నా గొంతులోని మాధుర్యము పోలేదను కొందును. అయినను పాడి చూచెదను.

ఓసి పురాతనక్షితిభృదుగ్రమహాప్రకశాలి!

వేనుఁడు : అది చదువకుము. నీవు నాకుఁ గైవారము చేసి నప్పటినుండి నాస్థితి యెంతమారినది ! ఇప్పు డెంత మారి నదో నాకుఁ దెలియదుకాని సన్నటివఱకు మారినస్థితి మీ నాయనమ్మ పాడినది. రేపటి కది యేమగునో !

శ్రీధరభట్టు : రాజా ! నా కా గోల తెలియదు. నేను స న్నెఱింగినట్లే పాడెదను.

వేనుఁడు : కానిమ్ము.

శ్రీధరభట్టు :

ఆకసము రెండుబారలపైకిఁ జనెఁ దమ్మిసొగసుపడతిమగఁడు ప్రా
రేకుల మివులుతుషారసమీకరణముకూడ వేడిమికి నాఁచెనుబో!

వేనుఁడు : శిశూ ! శ్రీధరా ! సూర్యుఁడ స్తమించిన యీవేళ నీ గీతము నాకుఁ దగులుటలేదు. నీ గీతార్థమునకుఁ దగిన స్థితి నాకింక మరలరాదు.

శ్రీధరభట్టు : అట్లనకుము. ఎప్పుడైన రావచ్చును.

వేనుఁడు : నాయనా ! బయటి యీవేనుఁడు శ్రీధరునితో మాటాడువేనుఁడు కాఁడు. వాఁడు నిజమైన పిశాచము.

శ్రీధరభట్టు : [నవ్వును]

వేనుఁడు : నవ్వకుము ! నవ్వకుము ! ఒక మహారుద్రభూతము వెదుళ్ళపొదలో దూసికొనిపోయినట్లు నవ్వకుము. శ్రీధరా! నీ నవ్వు నా ప్రాణములమీఁదఁ గూర్చున్నది.

శ్రీధరభట్టు : మహారాజా ! నేను నీ ప్రసాదము కోరవచ్చిన కుఱ్ఱవందిని. నానవ్వు నీప్రాణములమీఁదఁ గూర్చుండుట నా యభాగ్యముకాక మరియేమి ?

వేనుఁడు : నాయనా ! ఆతప్పు నీది కాదు, నీది కాదు.

[తెర]

# తొమ్మిదవ యంకము

[ప్రవేశము, పృథువు—భూదేవి]

భూదేవి : రాజకుమారా! రాజ్యరమ మీ తండ్రియైన యంగ రాజును వదలి నిన్ను నాశ్రయించుచున్నది.

పృథువు : మాయన్న వేనుఁడుగదా రాజు.

భూదేవి : అతనియందు రాజ్యలక్ష్మి యెన్నడు స్థితిపొందలేదు. అతనికిఁ బట్టాభిషేకమే లేదుగదా ? అతఁడు రాజ్యమును రాజ్యప్రజలను నాశనము చేయుటకుఁ బుట్టినవాఁడు కాని రాజ్య మేలుటకుఁ బుట్టినవాఁడు కాఁడు. దేశప్రజలను మలమల మాడ్చుట రాజ్యమేలుట కాదు. సింహము మృగములను దనయాకలి తీర్చుకొనుటకే చంపును. ఆ మృగములు చచ్చినందులకు వనజంతువులు దిగులుపడవు. సింహము మృగరాజు. అది యాకలికై చంపుమృగములు దానికి దాని పాలనములో నున్న జంతువు లిచ్చు పన్ను. పెద్దపులి క్రూరజంతువై యథేచ్ఛముగా మృగములను విరుచుకొని తినును. అది యాకలికిఁ గాదు. దానిగుణమే క్రూరత్వము. పెద్దపులి నెవరును మృగరా జనరు. అట్లే వేనుఁడును రాజు కాఁడు. వానియందు రాజ్యలక్ష్మిలేదు. ఓయి! పృథూ! రాజ్యలక్ష్మిదేవి తన చతుర్బాహువులతో స న్నాలింగనము చేయఁబోవు చున్నది.

పృథువు : నేను వేషముమాత్రము పురుషవేషము వేసితిని.

భూదేవి : నేనును వేషముమాత్రము స్త్రీవేషము వేసితిని.

పృథువు : మఱి నీ వెవరవు ?

భూదేవి : నేను రాజ్యలక్ష్మిని. నీవు సాక్షాన్నారాయణుఁడవు. నీ చతుర్బాహువులతో నా చతుర్బాహువులు జోడించి మల్లెపందిరి కట్టి యానీడలో లోకము విశ్రమింపజేయుము.

పృథువు : నా బాహువులు నీ బాహువులు కలిసినచో.

నాయెద యెల్లఁ గుంకుమసనాథము మోహనమూర్తియౌనో? నా
ప్రాయమునందు నెల్లఁ జివురాకులలోఁ బసిపిండలట్లు మో
హాయతి కల్గునో విరచితాస్మదుదారసమీహఁ జేసి నా
కాయము సర్వముం బనసకాయవలెం బులకల్ ఘటిల్లునో!

భూదేవి : [తనలో] ఇతనిలో నిగూఢమైన రాజత్వము విబోధిత మైనది. [లజ్జ]

పృథువు : అన్నట్లు నీ పేరు వసుంధరకాదూ? అవును. వసుంధరా !

ఇంతకుముందు తెల్లనయి యేకయి యుండిన నీకపోల మా
రింతలు సిగ్గుపూఁతఁ జివురించెనుఁ జెందొగ కేసరంబులై
ప్రాంతములం మనోభవుని బాటలు తీర్చుచు నీ కనుంగొనల్
క్రంతలు రాజమార్గములుగా నొనరించెను నామనస్సునన్.

భూదేవి : ఆయుష్మంతుడా ! నేను స్వతంత్రురాలనైనను నీవు నీతండ్రిచే నాజ్ఞప్తుఁడవు కావలయును.

పృథువు : ఇదుగో ! చూచితివా ? నాయెదలోఁ బ్రవహించు నీకాలువ నేను పా లనుకొంటిని. నీవు మధువులని చెప్పితివి. నాకుఁ దెలిసినది. నన్ను మరల నేల కినుకించెదవు ?

ఈ సితమేఘముల్ గొడుగులెత్తెను నీకును నాకుఁ జామర
శ్రీసవరించె నీ సుఖులు రేగిన గాలులు ప్రొద్దు వాలు సం
ధ్యాసమయారుణచ్ఛవి తనంతట దూతిక యయ్యె నీత్రపా
మాసరమైన యీబిగువు మాలిన వెన్నెల లారఁ గట్టెదన్.

భూదేవి : ఒక మహాపురుషుఁడు తన స్వశక్తి యెఱుఁగనే వలయును గాని యెఱిఁగినతరువాత ధౌరంధర్యము నానాముఖములఁ బ్రజ్వలింపఁజేయును. [ప్రకాశము] ఆయుష్మంతుఁడా! అదుగో! మీ తండ్రి వచ్చుచున్నాఁడు. నేను పోవలయును.

అంగరాజు : [ప్రవేశించును]

భూదేవి : ఈయనలో రెండువందలకళలే మిగిలినవి. ఇదిగో రెండు మిగిల్చి తక్కిన వన్నియు లాగుకొనుచున్నాను. రెండు సితనిజీవితాంత మితనియందే యుండఁగలవు.

[నిష్క్రమించును]

అంగరాజు : ఉన్నట్లుండి నాకాళులు తేలిపోవుచున్నవి. నా మొగము వివర్ణమగుచున్నది. ఆహా! ఏమి వడకొట్టినది! నామనస్సులోని బిగు వంతయు నొక్కసారిగాఁ బోయిన దేమి!

పృథువు : [సమీపించి] పితృపాదులకుఁ బృథువు నమస్కరించుచున్నాఁడు.

అంగరాజు : [ఆశ్చర్యము] తండ్రీ! ఆవెళ్ళినది వసుంధరయా యేమి?

పృథువు : [తనలో] ఈయన కెట్లు తెలియును? అవును. ఈమె మా తాతతండ్రుల మందలలో నుత్తమ గోవుగాఁ దిరిగినదికదా! [ప్రకాశము] చిత్రము.

అంగరాజు : అస లామె యెవ్వరో నీకుఁ దెలియునా?

పృథువు : వసుంధర, రాజ్యలక్ష్మి; ఇవి యామె నామధేయములు.

అంగరాజు : అది కాదు. ఆమె భూదేవి.

పృథువు : అట్లనా? [తనలో] అయ్యో! ఎంత యపచారము చేసితిని. ఆమెను నేను స్త్రీదృష్టితోఁ జూచితిని.

అంగరాజు : ఏమి యాలోచించుచున్నావు?

పృథువు : తండ్రీ! నా పాపమునకు నిష్కృతి యేమి?

అంగరాజు : అది భూతపూర్వమా? ఇంకను జరుగుచున్నదా?

పృథువు : [తనలో] నామనస్సు ఆమె మీదినుండి తిరిగి రాకున్నది. ఏమి చేయుదును?

మఱి కను లామె పీనకుచమండలభావమునందె లగ్నమై
తరుణివిలాసనూపురపదంబులనే చెవు లుండి నూత్న సీ
రరుహామనోజ్ఞవాసనలు రాజిలు నామెతనూవిలాస సుం
దరత బహిష్కరించదు మనస్సు-ఇది పాపమొ యేమికర్మమో!

అంగరాజు : తండ్రీ! నీ మన స్సామెయం దింతగా నెప్పుడు లగ్నమైనదో అప్పుడే వేనుని రాజ్యాధికారము వెనుక పట్టినది.

వేనుఁడు : [ప్రవేశించి] ఓహో! ఈవృద్ధరాజు తన తేజమంతయు డించుకొని పృథువునం దావహింపఁజేసెను గావలయు. పృథువు మధ్యాహ్న మార్తాండునివలెఁ బ్రకాశించుచున్నాఁడు. పృథువు ఆడపిల్లయని నన్నీముసలి మొదటినుండియు మోసము చేయుచున్నాఁడు. నా రాజ్యము తుదిరోజులు వచ్చినవి కావలయు నితనిని బురుషుఁడుగా మరల భాసింపఁ జేయుటకు. [సమీపించి] వృద్ధరాజా! ఇంద్రజాలి వగుదువు!

అంగరాజు : ఈ యింద్రజాలము నాదికాదు. చతుస్సముద్రముద్రిత ధరాదేవిది.

వేనుఁడు : ఆమె నన్ను వదలిపోదు.

పృథువు : వేనా! ఆమె నిన్నొకనాఁడు కలియను లేదు. నేఁడు వదలిపోవలసిన స్థితియు లేదు.

వేనుఁడు : ఆమె నీసొమ్మయినట్లు మాటాడుచుంటివి.

పృథువు : అవును. నాసొమ్మే.

పడతిసమార్ద్రలోచనము పచ్చి యొకింతయు నారలేదు నా
యెడద, లతాంగి దోసిళుల నిచ్చినభావపుఁ బూలతావు లీ
యెడల జనించినట్టి పులకోల్బణముల్ పెడఁబాయలేద యి
ప్పుడును వెలంది నామనసుఁబొక్కిలి సర్వము నాహరించెఁబో!

వేనుఁడు : అబ్బో! ఏమి మగతనము! నాల్గుగడియలకు పూర్వములేని దెంత మగతనము!

అంగరాజు : ఇంతపౌరుషశాలివైన వేనుని స్పర్ధకు స్థానభూతమైనది యెంతమగతనము!

పృథువు : వేనా ! ఆమెను నేను నే నామెను నచ్చినప్పుడు మధ్య నీ కీ యీర్ష్య యెందుకు ?

వేనుఁడు : ఆమె నిన్నటివరకు నాతో నభిసరించినది. నేఁ డామె నంతయు నాచుకొన్నట్లు మాట్లాడుచుంటివి !

పృథువు : ఆమె నీతో నెన్న డభిసరించలేదు. బలాత్కరించుటలోఁ బ్రథమావతారమెత్తిన నీతో నేస్త్రీయు నభిసరించదు. అందులో రాజ్యలక్ష్మియా !

వేనుఁడు : అవునవును. నాతోఁ గాదు. అంగనాపూర్వుఁడవైన నీతో నభిసరించును.

పృథువు : ఛీ ! ఛీ ! నే నంగనాపూర్వుఁ డనుకాను. అంగనాపూర్వత నా వేషమునందుమాత్రమే కలదు.

వేనుఁడు : నీ మొగము చూడరాదు. నీతో మాట్లాడను.

పృథువు : ఆ ! ఏమంటివి ! నీ దక్షిణబాహువు తెగిపోవువరకు నీతో నేను మాట్లాడను. [సమక్రమించును]

వేనుఁడు : అంగరాజా ! నేనును పృథువు నీకడుపునఁ బుట్టితిమికదా ? నీవు చెప్పుము. రాజ్యలక్ష్మి నాదా ? పృథువుదా ?

అంగరాజు : నేను చెప్పెడువరకు నెవ రాగిరి ?

వేనుఁడు : ఇప్పటికయినను నీవు చెప్పినచోఁ గాదనువారెవరు ? రాజ్యము నాదే. నీవు న్యాయము చెప్పుమంటిని

గౌతముఁడు : [ప్రవేశించి]

నాయము గంగలోఁ గలిసె ఆస్తికబుద్ధి హరించిపోయె గం
గా యమునానదీజలనికాయము రక్తముతో స్రవించె తా
నీ యవనీతలంబునను మృత్యువిహారము వెల్లుసాగెఁ నీ
యాయువు తీరె మా యసువులన్నియు తీరెను ధర్మదేవతా!

ఆహా! ఈనాఁడు నాయనుయాయులు మరలఁ దిరుగు బాటు జేసిరి. మరల మృత్యుసైన్యములు మారిమసంగెను. వీని పేరుమాత్రమే మృత్యువుకాదు. వీఁడు సాక్షా న్మృత్యువే. నెమరుకణతలయందును, నాలుకలలోనను, పొట్టలలోనను, మర్మస్థానములయందును గాని కత్తులతోఁ బొడవరాదు కాఁబోలు. నేను వృథాగా నీ జనులను రేపి వీరిని నాశనము చేయుచుంటినిఁ గాఁబోలు! ఏమిచేయు దును? [చూచి] అంగరాజింత తేజోహీనుఁడయ్యెనేమి! పొదవోలె నున్న తెల్లని కనుబొమలలోఁ దక్క నితని మొగమునందు రాజకళయే లేదేమి?

అంగరాజు: వేనుఁడా! న్యాయ మెవఁ డెందుకుఁ జెప్పవల యును? పృథురాజు నీయంతఃపురమున నిన్నాళ్ళుండఁగా నతఁడు పురుషుఁడని నీవె తెలిసికొనలేకపోయితివి.

వేనుఁడు: తెలిసికొనుట యెట్లు? అతడు నిష్క్రమించుకయధీ నములోఁ బెరిగెను. నీవును సునీథయు నాడపిల్లగాఁ బెంచి తిరి. అందరు నాడబిల్లయే యనుకొనిరి. నేను నట్లే యను కొంటిని. ఒకవేళ నేను తెలిసికొంటి ననుకొమ్ము. దాని వలన లాభ మేమి?

అంగరాజు: తెలిసికొన్నచో నీ విన్నాళ్ళు పృథువును బ్రతుక నిత్తువా?

గౌతముఁడు : [సమీపించి] ఓయీ ! అంగరాజా ! ఈ రహస్య మెన్నాళ్ళు దాచితివి? ఈరహస్యము బయటపడుటచేతనా నీవు నరకుదింపన యోడవలె నుంటివి ? వృద్ధరాజా! వృద్ధ రాజా ! ఈ రహస్యము తెలిసినచోఁ బృథువు సిన్నాళ్ళు బ్రతుకసత్తువా అనికాదు. నీ విన్నాళ్ళు బ్రతుకుదువా? యనుము. [అంగరాజు నిష్క్రమించును]

ఓయీ ! వేనుఁడా ! నేఁడు మరల నా యనుయాయులు తిరుగుబాటు చేసిరి. మరల మీ మృత్యువు వారిని బహు వుసికన్న హీనముగా హింసించెను. రేపు మరల నా సైన్యములన్నియుఁ గూర్చి వచ్చెదను. మా ప్రజలకింక మునుపటి యధైర్యము లేదు. నీవు చచ్చినచోఁ బృథు వును రాజుచేసెదము. ఇప్పుడు నీ సైన్యములు మాముం దాగలేవు, తెలిసినదా ?

ఓయీ! భార్గవౌశనససౌభరులారా ! సనాతన మత సైన్యాధిపులారా ! పృథువు వేనుని చెల్లెలు కాదు. తమ్ముఁడు. వేనుని జంపినచో రాజ్య మరాజకముకాదు. పోయి ప్రజలలో నిది చాటింపుఁడు.

ఓహో! జన మీ వార్తవిని పెళ్ళవిరిగి పోవుచున్నది. ఇంక వేనుని ప్రాణములు లేవు. మృత్యువునౌద్ధత్య మణఁగినది. వాని సైన్యములు నిరస్తము లయినవి. చీచీ ! నాబుద్ధి పెడతలఁ బట్టుచున్నది. వేనుఁడు నన్నుఁ జంపఁడుకనుక నది సాకుచేసికొని నే నింత విజృంభించుచుంటిని. ఇది నేను చేయవచ్చునా ? ధర్మముకొఱకు నే నిట్లు చేయుచుంటిని.

అదికాదు. వేనా! ఒకమాట. నేను నీ ముంగిటికి వచ్చితిని. నీ విప్పుడు నన్నుఁ జంపవచ్చును. నన్నుఁ జంపితివా నీ కీ తిరుగుబాటు లేదు.

వేనుఁడు: గౌతమా! నే నట్లు చేయను. నేను నిన్ను రాజుగా నురితీయించను. శిక్షించను. అట్లని నీ కిదివరకే వాగ్దాన మిచ్చితిని.

గౌతముఁడు: అట్లయిన నా కింకొక వాగ్దానముకూడఁ గావల యును. నీవు నన్ను శిక్షించవుగాన నా సైన్యములను నడపెదను. నీ సైన్యములను చెల్లాచెదరు చేసెదను. కాని ని న్నొంటరిగా నెదుర్కొనుజోదు దేశమునలేఁడు. కనుక నీవు నాతో నొంటరిగా యుద్ధముచేయుట కొప్పుకొన వలెను.

వేనుఁడు: గౌతమా! నీకుఁ బిచ్చియెక్కినదా యేమి? నా యొడల నరనరమునకు ఖడ్గము లున్నవి. నీ యొడలఁ జివ్వ రాకులున్నవి. ఇది నిన్నుఁ జంపుటకు నీ చెలికాండ్రు వేసినయెత్తు. ఒకవేళ నీ సైన్యములు నన్ను గెలుచునను కొమ్ము. ఈ రాజ్యము నీవు హరింతు వని యా దుష్ట స్త్రీ పన్నాగము పన్నిరి. పొరపడకుము.

గౌతముఁడు: నా కీ వాగ్దాన మిచ్చెదవా?

వేనుఁడు: నీ వీ మోసము తెలిసికొనలేవేని యట్లే.

గౌతముఁడు: రేపురాత్రికి వచ్చెదను. నీకత్తి తోమియుంచు కొనుము.

వేనుఁడు : రేపు తిథి యేమి ?

గౌతముఁడు : పూర్ణిమ. నేఁడు తిథిద్వయముకదా ?

వేనుఁడు : నేను యుద్ధముచేయను.

గౌతముఁడు : ఓహో ! మహావీరుఁడా ! కత్తిముట్టి యెరుఁగని బ్రాహ్మణునితో యుద్ధము చేయుటకు భీతి యేల ?

వేనుఁడు : శుక్లపక్ష మంతయు నీయందు నాకు స్నేహ మెక్కువ. కృష్ణపక్షమైనచో నీతో యుద్ధము చేసెదను.

గౌతముఁడు : అట్లయినచోఁ గృష్ణపక్షము రానిమ్ము.

వేనుఁడు : వలదు. రేపే చేసెదను రమ్ము.

గౌతముఁడు : కాదు. కృష్ణపక్షము రానీ [తనలో] ఇతని సైన్యమంతయు నశించినతరువాత నేను చచ్చినమాత్ర మేమి ? [పైకి] వేనా ! కృష్ణపక్షమునందే యుద్ధము చేయుదము.

వేనుఁడు : రేపురాత్రి యొకసారి రమ్ము. వత్తువా ?

గౌతముఁడు : తప్పక వత్తును [నిష్క్రమించును]

వేనుఁడు : ద్వాఃస్థితకా ! ఇటు రమ్ము.

ద్వాఃస్థితకుఁడు : [ప్రవేశించి] చిత్తము.

వేనుఁడు : ప్రొద్దునఁ గారాగారమందుంచిన బ్రాహ్మణుని దీసి కొనిరమ్ము.

[ద్వాఃస్థితకుఁడు నిష్క్రమించి బ్రాహ్మణునితోఁ బ్రవేశించును]

వేనుఁడు : బ్రాహ్మణుఁడా ! నీశాప మెంతవరకు వచ్చినది ?

బ్రాహ్మణుఁడు : సగమువరకు వచ్చినది.

వేనుఁడు : అనగా ?

బ్రాహ్మణుఁడు : ఒకరోజు గడచినది. ఇం కొకరోజు గడువ వలయును.

వేనుఁడు : రేపురాత్రికి నిజముగా నరుకఁబడునందువా ?

బ్రాహ్మణుఁడు : నిస్సందేహముగా. అరుంధతీపతిగోత్రము నందుఁ బుట్టి యగ్నిహోత్రమునకుఁ బావిత్ర్యమున సబ్రహ్మచారియైన నా వంశమున మహాపతివ్రతలు గాని కలుగనే కలుగరు. అట్టి నా కూఁతును బలవంతముగా మానభంగము చేసిన నీ సేనానాయకుని శిక్షించని రాజువు నీ వేమిరాజువు ? నాకూఁతురు తత్క్షణమ ప్రాణము విడిచెను. ఓరి ! దురాగ్రహపిశాచమా ! నేను వచ్చి నీ సేనానాయకుఁ డిట్లు చేసెననఁగా నేను చూడ లేదుగాన నమ్మనంటివి. నీ సేనాపతి నే నట్లు చేయలే దనఁగా వానిమాట నమ్మితివి. రక్తపాయి, మాంసఖాది యైన నీసేనాపతిమాట నిజము. సోమపీథిని నీవారభోక్తను నామాట యబద్ధము. నేను చెప్పినమాట నీవు చూడలేదు సరే నమ్మవు. వాడు చెప్పినది నీవు చూచితివా నమ్మితివి? నాపూర్వులే యనూచానులైనచో, సోమపీథులైనచో, మా సోమిదమ్మ దక్షిణగార్హపత్యాగ్నులకన్న నాహవ నీయాగ్నియందుఁ గొంచెము పక్షపాతము గలిగి యెక్కువ

శ్రద్ధచూపించునదియేని నా జపమాలసాక్షిగా రేపురాత్రి రెండుజాములకు నీ దక్షిణబాహువు నీ కంఠమునుండి తెగి క్రిందఁబడును. ఇది నా శాపము. నాయమోఘవాక్కును బంచభూతములు చూడుము రెక్కలమీఁద మోయు చున్నవి. రేపురాతిరి కల్ల నావాక్కు ఖడ్గమై నీ దక్షిణ బాహు వుత్తరించును.

వేనుఁడు: ద్యాపీతికా? ఇతని నిచ్చటనుండి తీసికొనిపొమ్ము.

[ద్వ్యాపీతకుఁడు బ్రాహ్మణుఁడు నిష్క్రమింతురు]

వేనుఁడు: బ్రాహ్మణులు పూర్వమందు శాపము లిచ్చి రని చెప్పుదురు. అవి యిప్పుడుకూడ నిజమగునా? ఈ బ్రాహ్మణులు శపించుటయేమి, అది నిజమగుటయేమి ? కాక పోయినఁ బృథువుకూడ నా దక్షిణబాహువు తెగువరకు నాతో మాట్లాడననెనే? అతఁ డీ శాపము విన్నవాఁడు కాఁడాయెను. దనికిఁ దగినట్లు గౌతముఁడు రేపు రాత్రికే నాతో యుద్ధము చేయుదుననియెనే? వలదంటినికదా! మరల రమ్మంటినే! అది యుద్ధమునకుఁ గాదుకదా!

గౌతముఁడు: నన్ను యుద్ధములో గెలువఁగలఁడా!

నావద్ద నేర్చుకొనిన కత్తిసాము గౌతముఁడు నా మీఁదనే యుపయోగించునా? అవునవును. జ్ఞాపకము వచ్చుచున్నది. శత్రువుచేయి నరుకు కత్తిదెబ్బ గౌతమునకు నేర్పితిని. అది చాలరోజు లయినది నే నభ్యాసముచేయుట మానివేసి కత్తి తెప్పించి యొకసారి చూతునా?

[తెరలో]

ఓహో! వేనరాజా! రాత్రి రెండుజాములు కావచ్చినది.

ద్వాఃస్థితకుఁడు: [పరుగెత్తుచువచ్చి] అయ్యా! ఈమె వినీత భట్టు కూఁతురఁట. సిందుమాలాలు. కైవారము చేయ వచ్చినది.

వేనుఁడు: ఏమి? శ్రీధరుని తల్లియా?

ద్వాఃస్థితకుఁడు: ఆ యురితీయఁబడిన పసివానితల్లి.

వేనుఁడు: సిందు మాలాలా?

ద్వాఃస్థితకుడు: అవును.

వేనుఁడు: పరుగెత్తుకొనిపోయి యీ కైవారము రేపురాత్రికి వచ్చి చేయుమని చెప్పుము; పొమ్ము.

[ద్వాఃస్థితకుఁడు నిష్క్రమించును]

ఈ సిందుమాలాలి నెట్లు బందిపెట్టుదును. పెట్టితినా? ఈమెయు నురిపెట్టుకొని చచ్చును. ఆహా! ఏమి విచిత్రమైన కుదురు వీరిది! చావన్న భయములేకుండ నొకరి తరువాత నొకరుగా వచ్చుచున్నారే. చివర కీ చావులో నేమియును లేదాయేమి? చచ్చిపోవుట యింత తేలికా!

ద్వాఃస్థితకుఁడు: [వచ్చి] అయ్యా! ఆమెతో నామెవంశములో నింక నెవరును మిగులరఁట. తప్పక యామె కైవారము చేసెద ననుచున్నది.

వేనుఁడు : ఓయీ! కాదు కాదు. రేపురాత్రికి తప్పక రమ్మ నుము. రేపురాత్రి కభ్యంతరపెట్ట నని చెప్పుము.

ద్వాఃస్థితకుఁడు : ఆమె వినుటలేదు.

వేనుఁడు : నీవు పోయి యాబ్రాహ్మణుని దీసికొనిరమ్ము.

[ద్వాఃస్థితకుఁడు నిష్క్రమించి బ్రాహ్మణునితోఁ బ్రవేశము]

వేనుఁడు : బ్రాహ్మణుఁడా! చాల గొప్పఋషివి. నిజమైనచో నీమాటయే నిజము కావలయును. నీ శాపము రేపు రాత్రికా, యీ రాత్రికా?

బ్రాహ్మణుఁడు : రేపురాత్రికే.

వేనుఁడు : కాదయ్యా! కాదు. నే నీ రాత్రియే మృతిపొందు చుండగా రేపురాత్రికి నా దక్షిణబాహువు తెగుటయేమి?

బ్రాహ్మణుఁడు : రేపురాత్రికి వేనునిశవము దక్షిణబాహువు కాదు తెగునది. బ్రతికియున్న వేనుని దక్షిణబాహువే తెగును.

వేనుఁడు : ద్వాఃస్థితకా! కత్తి తెమ్ము. ఈ రాత్రియే నరుకు కొని చచ్చెదను.

బ్రాహ్మణుఁడు : నీవు రేపురాత్రియే చచ్చెదవు.

వేనుఁడు : ద్వాఃస్థితకా! నీవు వీనిని బంధించి కత్తి తీసికొని రమ్ము.

[ద్వాఃస్థితకుఁడు బ్రాహ్మణుఁడు నిష్క్రమింతురు]

వేనుడు : ఈమె కైవారము చేయకముందే చనిపోయెదను. చనిపోకపోయినచో వేనుని చండశాసన మేమగును? బ్రతికియుండినచో నీజంటప్రాణము నెట్లు తీయుదును? అందులో శ్రీధరునితల్లినా చంపునది?

ద్వ్యాపీతకుఁడు : [ప్రవేశించును]

వేనుఁడు : ఏమిరా! ఖడ్గము తెచ్చితివా?

ద్వ్యాపీతకుఁడు : స్వామీ! ఆమె కైవారము రేపురాత్రి వచ్చిచేసెద నన్నది. లోపల శిశువు కదలాడుచున్నదఁట. ఈరాత్రి యామె ప్రసవించునేమో యని భయముగా నున్న దట.

వేనుఁడు : ద్వ్యాపీతకా! ఇవి యన్నియు లాగివేయుము.

ద్వ్యాపీతకుఁడు : ఏవి యన్నియు?

వేనుఁడు : ఇవిగో! చూడుము? నాచుట్టును పెద్దసాలీఁడు దారము లల్లినాఁడు. నే నందులోఁ దగులొంటిని. చేతులు కాళ్లు లాడుటలేదు. ఈసాలీఁడు నామీఁద దుమికి చంపునేమోకాని యీదారములు చప్పునఁ ద్రెంచుము.

ద్వ్యాపీతకుఁడు : అయ్యా! నాకుఁ గనఁబడుటలేదు. నే నెట్లు త్రెంచుకును?

వేనుఁడు : కనంబడుటలేదా? సరేకాని. ఒక మంత్రసానిని చూచి యామెకు సాయము పంపుము.

[ద్వ్యాపీతకుఁడు నిష్క్రమించును]

వేనుఁడు: ఈదారములు జిగురుగా నున్నవి. ఈసాలీ డెక్కడ నున్నాఁడో కనబడుటలేదు. అబ్బా! చేతులు కట్టివేసి నట్లున్నదే? ఈ పిశాచములు నేఁడు నా దగ్గరకు వచ్చుట లేదేమి? రోజును నా చుట్టును చేరి నృత్యముచేయును. నన్ను వెక్కిరించును. ఈ నాఁడివి నాజోలికే వచ్చుట లేదు. నాకు దూరదూరముగాఁ బోవుచున్నవి యేలనో! పాప మీ పిశాచముల కేదో దుఃఖకారణము కలిగినది? ఆహా! ఇదియా! ఈమెను నేను చంపించినచో నీమె గర్భస్థ శిశువుకూడ మరణించిన వీరికి వంశాంకురము లేకుండఁ బోవునని, దానివలన వీరికి ఉత్తమగతులు కలుగవని. ఉత్తమగతు లున్నవా యేమి? ఆ యుత్తమగతులు పుత్రకృత తర్పణలభ్యములా? లేకున్న నీ పిశాచము లిట్లలజడి పొందనేల? వీనికి మనుష్యులకన్న నెక్కువ జ్ఞానము కలదు. ఉత్తమగతు లన్న జ్ఞానము వీనికిఁ గల దేని యది నిజమే కావలయును. దౌహిత్రులు పౌత్రులు విడుచు నివాపాంజలులు మోక్షహేతువు లైనచో వివాహము లాడియే తీరవలయును. వివాహము వలదనియే శాసించితినికదా? ఇంద్రియ జ్ఞానము చాల నీచమైనది. నే నిన్ని ఘోరములు చేసిన తరువాతఁగాని నాకతీంద్రియ జ్ఞానము కలుగలేదు. ఇప్పు డేమి చేయుదును?
ఈ పిశాచములు నావంక సంశయదృష్టుల పరపుచున్నవి. శే పీమెను నేను చంపుదు నని యివి తలఁచుచున్నవి కావల

యును. రేపటికి వేనుఁడే యుండఁడు. [పరిక్రమించి] నేను నా శయ్యాస్థలమునకు వచ్చితిని. కొంచెము విశ్రమింతునా? రేపు రాత్రికిఁ జనిపోవుదానికి నీ రాత్రి విశ్రాంతి యెందులకు? శ్రీధరుని బిలిచి మాటాడెదను. శ్రీధరా! శ్రీధరా! ఏమి! యితడు పలుకుటలేదు. ఎచ్చటికైనఁ బోయెనా? శ్రీధరా! శ్రీధరా!

శ్రీధరుఁడు : [వచ్చి] జయము జయము మహారాజులకు!

వేనుఁడు : ఇక్కడ మహారా జెవరు?

శ్రీధరుఁడు : వేనుఁడు.

వేనుఁడు : వేనుఁడు కాదు. నేటినుండి మహారాజు పృథువు.

శ్రీధరుఁడు : పృథు వెవ్వరు?

వేనుఁడు : పూర్వము నా చెల్లెలు. ఇప్పుడు తమ్ముఁడు.

శ్రీధరుఁడు : నాకు నవ్వు వచ్చుచున్నది.

వేనుఁడు : నాయనా! నవ్వకుము. నీవు నవ్వినచో నా హృదయములోని నరములు బిగించినట్లగును. నా ప్రాణము లెండి నట్లగును. వడకొట్టి శోషపొందిన నా యాత్మమీఁద నిప్పులు చెరిగిన ట్లగును.

శ్రీధరుఁడు : నీ హృదయము పచ్చిపుండువలె నేల యయినది?

వేనుఁడు : శిశూ! నీవు చనిపోయి యెన్నాళ్ళయినది?

శ్రీధరుఁడు : [లెక్కపెట్టి] అబ్బో! పదియేళ్లయినది.

వేనుఁడు : పదియేళ్ళా ! కాదు. పదిరోజులు.

శ్రీధరుఁడు : కాదు కాదు. పది యేళ్ళు.

వేనుఁడు : [తనలో] ఒక్కొక్క మనుష్య దినము పిశాచముల కొక్కొక్క సంవత్సరము కాఁబోలు.

శ్రీధరుఁడు : ప్రభువులేమో యాలోచించుచుంటిరి ?

వేనుఁడు : అప్పటికి మీతల్లి "గర్భిణితో" నున్నదా ?

శ్రీధరుఁడు : అవునవును. జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

వేనుఁడు : శ్రీధరా ! నీకుఁ జిన్న తమ్ముఁడు పుట్టును.

శ్రీధరుఁడు : రాజా ! నాకేమియుఁ దెలియుటలేదు. నాతల్లి దండ్రులు నేను చాల తెలివితేటలు కలవాడ ననుకొనెడి వారు. నే నీజన్మమెత్తినతరువాత నేనే నాకు ఏదోకలలో తిరుగుచున్నట్లుండును. మీ రన్నది నా కేమో తెలియలేదు.

వేనుఁడు : వినీతభట్టాదులకువలె నితనిజ్ఞానము నశితమై లేదు. బాలగ్రహముల సృష్టి యిందులో వేరుకాఁ బోలు. శ్రీధరా ! నేను రేపురాత్రికి చనిపోయెదను.

శ్రీధరుఁడు : అయ్యో ! అయ్యో ! [నవ్వును]

వేనుఁడు : నేను చనిపోయెద ననగా నీవు నవ్వెదవేమి ?

శ్రీధరుఁడు : నాకు నవ్వునకేడ్పునకు భేదము లేదు. రెంటికి నేను నవ్వుటయే. ఈలోకమున నంతే.

వేనుఁడు : శ్రీధరా ! నీ వెక్కడికైన పోవా ?

శ్రీధరుఁడు : ఎక్కడకుఁ బోను? ఎప్పుడును ఆబీరువావెనుక దాగియుందును. కుక్కలను జూచినచో నాకు భయము. అవి నన్నుజూచి మొరుగును. ఎప్పుడును ఆబీరువావెనుకనే యుందును.

వేనుఁడు : నాయనా ! నీ వింకఁ బొమ్ము.

[శ్రీధరుఁడు సష్కరించును]

వేనుఁడు : ఆహా ! బలవన్మరణమా ! నీవు మనుష్యులను పిశాచలోకములో దించుచున్నావు. నేనుకూడ పిశాచమ నగుదునా యేమి ? కాను కాను! ఇప్పుడు నేను పిశాచమునే యగుదును. కాకున్న నాకీ పిశాచములతోడఁ బ్రసంగము చేయుశక్తి, వానినిఁ జూచుశక్తి కలుగదు. నేను చేసిన మహాఘోరకార్యముల బలమున నాలోఁ బిశాచవృత్తి జనించి నాకు వీసితో సమానమైన మానసికశక్తి కలిగించి నది. నాకు నిద్రవచ్చుచున్నది.

[తెర]

# పదియవ యంకము

[తెరలో]

వసుంధరా! వర్ధిల్లవమ్మా! వర్ధిల్లు
రాజ్యలక్ష్మీ! జయించవమ్మా! జయించు
గోరాణీ! పెంపొందవమ్మా! పెంపొందు!

భూదేవి : [ప్రవేశించి] ఓహో! జలవతీ స్థలవతీ తేజోవతులా! సఖులారా! మీమాట లాశీర్వాదములవలె గ్రహించు చున్నాను. చెలులారా! మీరు నా కిది సహాయపడఁ దగినవేళ. ఓహో! స్థలవతి! నేను వేనునినుండి పృథివీ భాగ ముపసంహరించుకొను చున్నాను. నీవు వాని నావ రించి పెట్టుము. ఓహో! తేజోవతి! నీవు వేనునినుండి బహిర్గమించి పృథుమహారాజులోఁ బ్రవేశించుము. ఓసి జలవతి! నీవుకూడ వేనుని ప్రాణములకు రససిద్ధి లేకుండఁ జేయుము. సఖులారా! మీరు నా కీ సాయము చేసిపెట్ట వలయును.

[తెరలో]

ప్రాణిలోకస్థాన భూతమా! వసుంధరా! ప్రకాశించ వమ్మా! ప్రకాశించు!

భూదేవి : ఓహో! అసిలాధిదేవతా! నమస్కారము. సఖీ! నాయందు దయయుంచుము. నీవు వేనుని ప్రాణము లయిదును మూటకట్టి వాని దక్షిణబాహుమూలమున నుంచుము. నా యీసఖులు నాయెడఁ బ్రసన్నలైనట్లు

ఒకర్తుక విస్తరించి ఒకర్తు నాకనులు మిరుమిట్లు గొలిపి, యొకతుక నాహృదయము స్నిగ్ధముచేసి యొకరిత నన్ను గాలిలోఁ దేలిపోవునట్లు చేసి నాయెడల స్నేహము ప్రకటించుచున్నారు. ఆయుష్మంతుఁడా! పృథుమహారాజా! నీయెడలఁ బంచభూతములు ప్రసన్నములైనవి. ఇంక నీవు ధర్మస్థాపన చేయుము. నే నిదె వచ్చి నన్ను గలసికొనెదను.

[ఇది విష్కంభము]

[తరువాత గౌతముడు ప్రవేశించును]

ఆహా! వసుంధరాదేవికిఁ గల్యాణ దినములు వచ్చినవి. అన్నిటికన్న నీ కాలమే చిత్రమైనది. ఏది జరుగుచున్నపుడదే శాశ్వత మనిపించును. ఇంతకుముందువరకు వేనుని రాజ్యమే శాశ్వతము కాఁబోలు, దేవుఁడా! యెట్లురా! యనిపించినది. ఇప్పుడప్పుడే సౌఖ్యము శాశ్వతమైనట్లు ప్రాణము స్థాయికిఁ జేరినది. కాలముకన్న మనస్సు చిత్రమైనది. నానాకష్టములు పడిన యీ మనస్సున కిప్పుడు పూర్వమే కష్టములు ననుభవించనట్లే యున్నది. విచారించినఁ గాలమును మనస్సును నేకాకృతులవలె నున్నవి. చేయవలసిన కార్యము పూర్తిగాఁ దుదముట్టలేదు. మృత్యువు నశించెను. వాని సైనికులు చెల్లాచెదరైరి. మిన్నుమన్ను తెలియక ప్రవర్తించిన యా సైనికులు తుదకుఁ గాళ్ళబేరమునకు దిగిరి. రాజ్యమంతయు మా

వశమైనది. కాని ప్రధాన కారణమైన వేనుఁ డట్లే యున్నాఁడు. వేనుఁడు మిగిలికూడఁ బ్రాణములను మిగులనట్లే యున్నది.

కసి నన్నుఁ దరుముచున్నది కాని యీ వేనుఁడు మిగిలిన మాత్రమేమి? ఋణశేషము శత్రుశేషము మిగులరాదు. నాకు వేనుఁ డేమిశత్రువు? ధర్మమునకు శత్రువు. అధర్మ మిప్పుడు వేనునిచేత మరల నాశనము చేయబడు స్థితి దాటినది. ఇంక వేనుని వదలిపెట్టెదను.

వేనుని వదలిపెట్టక నేను వేను నేమిచేయగలను? వేనుడు చెప్పినట్లు వానికి నరనరములయందు ఖడ్గము లున్నవి. నాకు చివురాకు లున్నవి. నే నతని నేమియుఁ జేయలేను.

చేయలేన యనుము. నే నతనిని వదలరాదు. ధర్మపక్షపాతముచేతనేనాయెను వేనుని చెలిమి విదలించి నిందించి యతని నింతవరకుఁ దెచ్చినది నేనేకదా? అతఁడో! నేనో! ఇంతియే కాని మే మిర్వురము మిగులుట దేవత లొప్పుకొనునదికాదు.

[తరువాత వేనుఁ డానందావేశముతోఁ బ్రవేశించును]

వేనుఁడు: గౌతముఁ డింకను రాలేదేమి? రాత్రి రప్పుడే పది గడియలు గడచినది. ఈ వెన్నెలలు వెండిసాలీడు దారములల్లినట్లు ధగధగ లాడిపోవుచున్నవి. శుక్లాష్టమినాఁటికన్న నవి ముదిరి సందులందుఁగూడఁ దెలుపెక్కినవి.

గౌతముఁడు : [సమీపించి] వేనుఁడా ! వచ్చితిని. ఏమంత మహోత్సాహముగ నుంటివి !

వేనుఁడు : చావఁబోవువానికి నాకేమి దిగులా ?

గౌతముఁడు : కాదు, కాదు. వేనా! దివ్యపురుషునివలెనుంటివి. ఇందాకటినుండియు వీణ వాయించుచుంటివి కాఁబోలు ?

వేనుఁడు : చివరిసారి నీవుకూడ విందు వని చాలసేపెదురు చూచితిని. నీవు రాలేదు. ఇంక రాతిరి రెండుజాము లగు నేమో యని యాపివచ్చితిని.

గౌతముఁడు : ఎందు కింత తొందర? రెండుజాములయిననేమి?

వేనుఁడు : నేను రెండుజాములు కాకముందే యీ శరీరము వదలవలయును.

గౌతముఁడు : ఎట్లు వదలఁగలవు ?

వేనుఁడు : నీతో యుద్ధముచేసి.

గౌతముఁడు : కృష్ణపక్షము రానిమ్ము.

వేనుఁడు : గౌతమా ! కాదు, కాదు. కృష్ణపక్షములో నా చీఁకటిత్రోవలలో నేను పోలేను. ఈ వెన్నెలబాటలలో వీణ వాయించుకొనుచుఁ బోయెదను. నన్నిపుడే పోనిమ్ము.

గౌతముఁడు : నేను యుద్ధమునకు సిద్ధమై రాలేదు.

వేనుఁడు : సిద్ధ మనగా నేమి ?

గౌతముఁడు : ఖడ్గము తేలేదు. డాలు తేలేదు.

వేనుఁడు: ఖడ్గములు రెండున్నవి. డాలు నాది, నీవు తీసికొనుము.

గౌతముఁడు: నీకో?

వేనుఁడు: నాకెందుకు? చావఁబోవువానికి డాలుండి రక్షించునా?

గౌతముఁడు: వేనా? నేను నీతో యుద్ధము చేయను.

వేనుఁడు: ఎందుచేత!

గౌతముఁడు: నా ప్రాణమిత్రుని నేను చంపను.

[ఇద్దరును విడి విడిగాఁ గూర్చుందురు]

ద్వారపాలకుఁడు: మహారాజా! కోట శత్రువులవశ మైనది. సైన్యులందరు కోట దాటిపోయిరి. శత్రువుల కందినవారు హతులైరి. వారంద రావేశపరులై వేనుఁ డెక్కడ వేనుఁ డెక్కడ నని వచ్చుచున్నారు. వారిని బృథువు వారించుచున్నాఁడు.

వేనుఁడు: గౌతమా! లెమ్ము! ఇదిగో నీ ఖడ్గము. ఇది నాది. నీ ఖడ్గమున కెక్కువ పదునుపెట్టితిని. నాఖడ్గము వాదరమొండిచేసితిని. నీతల బ్రద్దలైనను ప్రాణము పోదులే.

గౌతముఁడు: వాడిగల ఖడ్గమే నీవు తీసికొనుము.

వేనుఁడు: ఇంక వేళలేదు, రమ్ము. [లాగుకొనిపోవును]

ద్వారపాలకుఁడు: వీరి యిద్దరి కత్తియుద్ధము చూడ ముచ్చటగా నున్నది. ఈ రెండుకత్తులు వెన్నెలలోఁ దళతళ లాడుచు

నిసుకతిన్నె లమీఁద బుసకొట్టుచు గోదుమవన్నె త్రాఁచులు పెనవేసికొను చున్నట్లున్నవి.

గౌతముఁడు: [ప్రవేశించి] వేనా! నీవుకూడ నిశితమైన ఖడ్గము పూసినఁగాని నేను యుద్ధము చేయను.

వేనుఁడు: ద్వాఃస్థితకా! నీ చేతిలోని ఖడ్గము నాకిమ్ము. [తీసికొని] ఇంక రమ్ము. గౌతమా! నాకు శౌర్య మెక్కు చున్నది. నీవు నాయెదుట నిలువలేవు.

[ఇరువురు నిర్గమింతురు]

ద్వాఃస్థితకుఁడు: [చూచి] ఈదెబ్బతో గౌతముఁడు నిలువఁడు. ఆహా! గౌతముఁడు నేలఁ బడనేపడెను.

వేనుఁడు: [ప్రవేశించి] ఆహా! గౌతమా! ఇది నా రాజ్య నాశనమునకు నీ ప్రాణనాశనమునకు వచ్చినది. కాదు కాదు. గౌతముఁడు మూర్ఛపోంనెను.

[తెరలో]

ఓహో! వేనమహారాజా! రాతిరి రెండుజాములు కావచ్చు చున్నది.

వేనుఁడు: ద్వాఃస్థితకా! ఏమది?

ద్వాఃస్థితకుఁడు: శ్రీధరభట్టుతల్లి కైవారము చేయవచ్చినది.

వేనుఁడు: ఈమె ప్రసవించలేదా?

ద్వాఃస్థితకుఁడు: రాతిరి వచ్చిన నొప్పు లాగిపోయిన వఁట.

వేనుఁడు : నీవు పోయి యొక్కకొంచెమునే పోగుమనుము. రెండుజాము లగుట కింకను రెండు గడియ లున్నదికదా? పోయి చెప్పుము. [ద్వాఃస్థితుఁడు నిష్క్రమించును]

గౌతముఁడు : [ప్రవేశించి] వేనా! నీ యెడల నా స్నేహ మంతయు గోసివేసితిని. రమ్ము. కత్తి పుచ్చుకొన్నపుడు పాము బరిమీఁద దిరుగునట్లు తిరుగు నీయొడుపు నే నెరుగుదును. ఈ నీ వేగమునకు మాంద్య మాపాదించు కత్తి దెబ్బలు నేను నేర్చుకొనియే వచ్చితిని. కాని యీయుద్ధము కృష్ణపక్ష మనుకొని యీనాఁడు సిద్ధముగా లేను. అయినను రమ్ము.

ద్వాఃస్థితుఁడు : [ప్రవేశించి] ప్రభూ! ఆమె గొంతు సవరించుకొనుచున్నది. ఇంకను మొదలుపెట్టలేదఁట.

వేనుఁడు : గౌతమా! జయము నీకే రావలయును. వేనుఁడే చనిపోవలయును. రా, పోదము.

[ఇద్దరు నిష్క్రమింతురు]

ద్వాఃస్థితుఁడు : వేనుఁడ ట్లనెనేకాని కత్తి చేఁబూనినంతనే యాయన కొడలు పొంగిపోవుచున్నది. అయ్యయ్యో! మరల గౌతమునకు గాఢప్రహారము తగిలెను. అతఁడు కూలఁబడినాడు.

వేనుఁడు : [ప్రవేశించి] నాపొంగు నెంత కుదించుకొంద మనుకొన్నను గత్తి పట్టినంతలో నెదుటివానికే దెబ్బ తగులుచున్నది. పాపము! గౌతముఁ డీసారి లేవలేఁడు.

గౌతముఁడు : [ప్రవేశించి] వేనా! వేన! వేదఋషుల తపస్సు చెడిపోలేదు. నీవంటి పాపమూర్తి నేలపై నిలువరాదు. ని న్నీసారి నిలువనీయను.

[తెరలో]

ఓయీ! వేనమహారాజా! రెండుజాములు కాఁబోవు చున్నది.

వేనుఁడు : ద్వ్యాపీతకా! ఆమెతో నింక నొక్కగడియ యున్న దని చెప్పుము. గౌతమా! రమ్ము [నిష్క్రమింతురు]

ద్వ్యాపీతకుఁడు : చీ! చీ! ఈదెబ్బయు గౌతమునకే తగిలెను. పాపము! గౌతముని యొడలు వసంతము చల్లుకొన్న ట్లున్నది.

వేనుఁడు : [ప్రవేశించి] నేను గౌతమునే చంపెదను. మరల నారాజ్యము స్థాపించెదను. పారిపోయిన సైన్యాల నందరిని పిలిపించి నామతము మరల నిలువఁ ద్రొక్కెదను.

గౌతముఁడు : [ప్రవేశించి] వేనా! వేనా! ఇంక నీ మతము నిలువనీయను. రమ్ము రమ్ము. వెనుక నాను శత్రుబాహువు నరకుదెబ్బ నేర్పితివి. జ్ఞాపక మున్నదా? దానిని నే నయిదు రోజులనుండి దివారాత్రములు సాధనచేయు చుంటిని. నీ కది సాధనలో లేదు. నిత్యసాధనచేతనే యది వశమగునది యని నీకుఁ దెలియును. నీవు చేసినయధర్మ మంతయుఁ బండినది. ఇంత యధర్మము చేసిన నీ చేతిని నరకెదను. చేతనైనచోఁ దప్పించుకొనుము.

[తెరలో

రాజా! రెండుజాములు సరిగా నైనది.

ఒక విలిప్తయైన నుండగా వేనుండు
సెలవులేదు లేదు సెలవు లేదు
ద్విజులశాపవహ్ని భీకరంబయి దక్షి
ణాంసఘోరదళన మాచరించె.

వేనుఁడు: గౌతమా! శ్రీధరునితల్లి కైవారము సగము చేయనేచేసిన దోయి! రా! రా! నాబాహువు నీవు నరుకఁగలవా? [గౌతముఁడు వేనుఁడు నమస్కరించును]

ద్వాఃస్థితకుఁడు: [చూచి] ఆహా! [మూర్ఛ]

[తరువాత వేనుని మోయుచు గౌతముఁడు ప్రవేశించును]

గౌతముఁడు: ఆహా! మహావీరుఁడైన వేనుని నొక కృతిమముచేసి నఱికిన నాపాతకము పాయు నుపాయము లేదు.

వేనుఁడు: మిత్రమా! పాతకము లన్నియుఁ జేసినది నేను. దానిఫలము నే ననుభవించితిని. నా దక్షిణబాహుదళనమున నీవు నిమిత్తమాత్రుఁడవు. ఇది యొక తపోమూర్తియైన బ్రాహ్మణునిశాపముచే నిదివఱకే తెగినది.

ద్వాఃస్థితకుఁడు: [లేచి] మహారాజా!

వేనుఁడు: ఛీ! ఛీ! అట్లనకుము. మహారాజును నేనుకాదు. పృథువు. నీవు పోయి పృథువును దీసికొనిరమ్ము.

[ద్వాఃస్థితకుఁడు నమస్కరించును]

గౌతముఁడు : అన్నా ! నిన్నుఁ జంపువఱకును నాప్రాణము లాగినవికావు. నా కాత్మబంధువును, మహాగాయకుని, సత్కవిని, మహాశిల్పిని నిన్నుఁ జంపి నేను లోకద్రోహి నైతిని.

వేనుఁడు : నాయనా ! అట్లు కాదు. నేను లోకకంటకుఁడను. సాక్షాన్మృత్యువను. దురాశాపిశాచావేశపరుఁడనై నీవు పూర్వము నాతోఁ జెప్పిన సర్వపాపములను జేసితిని. దానికిఁ బ్రతిక్రియ యీరీతి ననుభవించితిని. అందులో నాకుఁ బరమాప్తుఁడవైన నీచేతిలోఁ జావు పరమవాంఛ నీయమైనది.

గౌతముఁడు : ఇంతటి మహాపురుషుఁడవు నీ వీ లోకమునువదలి పోవుచుండఁగా నే నేలాగున బ్రతుకుదును ? [ఏడ్చును]

వేనుఁడు : మిత్రమా ! ఏడువకుము. నామూలమునఁ జెదరి పోయిన పంచభూతములు వెన్నెలదారులలో మరల సర్దు కొనుచున్నవి. బిగ్గరగా నేడ్చి వానిని జెదరఁగొట్టకుము.

[పృథువు అంగరాజు ద్వ్యామీతకుఁడు ప్రవేశింతురు]

పృథువు : [వేనుని సమీపించి] అన్నా ! వేనమహారాజా ! నాయవినయమును మన్నింపుము. నీదక్షిణబాహువు తెగిన గాని నీతో మాటాడ నని ప్రతినపూని యగ్రజుఁడవైన నీయెడ నాచేసిన దోషమును మన్నింపుము.

వేనుఁడు : ఓయీ ! నీకు నా క్షమాపణ లక్కఱలేదు. నీవు సాక్షాన్నారాయణుఁడవు. భగవంతుఁడైన నారాయ

ణుఁడు లేఁడని నేను నాస్తికుఁడనై యిన్నాళ్ళు వాదించి తిని. ఆ వాదనలోని కుతర్కము నాకు రాత్రి తెలిసినది. నాచుట్టును బెద్దసాలీఁడు గూడల్లినట్లు నన్నందులో నాశనముచేయ నేదో యొక పెనుభూతము కాచుకొని యున్నట్లు తోఁచి దాని పరమార్థము చివరకుఁ దెలిసి కొంటిని. ఆ సాలీనిగూడు నా చేసికొన్నకర్మము. నన్ను నాశనముచేయ వేచిన యా సాలీఁడే నారాయణుఁడు. ఎవని కర్మబంధముల వానిని త్రిప్పుచున్న నారాయణుఁడు లేఁడని వాదించి యదివరకే తిగినన్ని యున్న తాళ్ళు వృథాగా వేనవేలు పెంచుకొని నేను చివరకుఁ గాలుసేతు లాడకుండఁ జేసికొంటిని. దాని ఫలితము ననుభవించితిని.

అంగరాజు : చివరకుఁ దత్త్వము తెలిసికొన్న నీవే ధన్యుఁడవు.

వేనుఁడు : తండ్రీ! నమస్కారము. ఇదివరకు నా పలికిన మాటలు నా చేసిన తప్పులు సర్వము క్షమించుము.

అంగరాజు : నాయనా! నీబుద్ధి పెడత్రోవ పట్టినది కాని దాని నైశిత్య మప్రతిమాన మైనదికదా!

వేనుఁడు : తండ్రీ! అనర్హుఁడనైనను నొకప్రశ్న యడుగు చున్నాను. నాతల్లి సునీథాదేవి యేమైనది? ఆమె నొక సారి అమ్మా! యని పిలిచి చేసినపాపము లన్నిఁటికి నిష్కృతి చేసికొందును.

అంగరాజు : నీవు పోనున్న లోకములలో నామెను జూతువు. నీ ఘోరకృత్యముల కామె యోర్వలేక నీవంటివానిని గన్న

యామెశీల మెట్టిదో యను లోకమునింద పడలేక యామె యాత్మహత్య చేసికొన్నది.

వేనుఁడు : అయ్యో! [మూర్ఛిల్లును]

గౌతముఁడు : ద్యాపీతకా! మొగముమీఁదఁ గొంచెము నీరు చల్లుము.

వేనుఁడు : [సేదదేరి] పృథూ! నీ ప్రజనంతయు నానావిధముల నాశనము చేసితిని. బాధలు పెట్టితిని. వారిని నే నొకటి చేసి యొకటి చేయలేదా? ఈ మహాపాపిని నన్ను నీవు క్షమింతువా?

పృథువు : ఈయనంతమైన కాలమున నిట్టి వస్తువులు. అదియుఁ గాక యిందుఁ జంపెడు వాఁడెవఁడు? చచ్చెడువాఁడెవఁడు? ఊరకే భ్రాంతి కట్లు తోఁచును.

[భూదేవి ప్రవేశించును. పృథువుతక్క నందరు నమస్కరింతురు]

అంగరాజు : వేనా! ఈమెయే రాజ్యలక్ష్మి. భూదేవి.

వేనుఁడు : భగవతి! నమస్తే. పృథూ! పంచప్రాణములును గూడుకట్టి నాదక్షిణబాహుమూలమున నిలిచినవి. నా ప్రాణములు పోవుచున్నవి. నన్నిచటినుండి తీసి వేయుము.

భూదేవి : [తనలో] నా సఖులైన యనిలవతీ స్థలవతీ జలవతీ తేజోవతులు నాకు సర్వథా నేను కోరిన ట్లుపచరించిరి.

[తెరలో]

ఓహో! వేనాసురదక్షిణబాహునిర్మథనసంజాత! పృథు చక్రవర్తి! వర్ణాశ్రమాచారరక్షాదక్షదక్షిణబాహూ! వసుంధరాదేవీప్రాణవల్లభ!

వలుదెస లగ్నిహోత్రములు వాటిన ధూపము లావరించు క
త్తులకొస మందు సైనికులతోఁ జెడరేఁగిన వేను సైన్య గా
లులు విడిపోవుమార్గములలో నెదురై చనుదెంచి నీకు గా
లులు విసరెన్ సుశీతలములున్ బరివాసితముల్ ప్రమందముల్.

పృథువు: ఇది యేమిధ్వని గాలిలోపొరలలోనుండి వచ్చుచున్నది?

భూదేవి: శ్రీధరునితల్లి గర్భస్థశిశువు నీకుఁ గైవారము చేయుచున్నది.

వేనుఁడు: ఆహా! అంత కసియే కాంబోలు నిదికూడ శ్రీధరుని వాక్కువలె జిగిమీరుచున్నది.

అంగరాజు: ఎంతమంది వేనులు మాడ్చినను నీయంకురము లీ దేశమునందు మాడిపోవు. చిగుర్చుచునేయుండును.

భూదేవి: వేనరాజు మతమువంటి దుష్టమతములు వచ్చుచునే యుండును. పోవుచునే యుండును. పైని నిప్పులుముట్టించి తగులఁబెట్టునేగాని యీలోపలి నిత్యమై పసిమికల యీ యీ యంకురములకుఁ జేటులేదు.

వేనుఁడు: ఈ యంకురములపసిమి నిజముగా నెన్నటికి జావదు. నేను కాచినయెండకే మాడని యీపసిమి సనా

 

తనమైనది. నాకే తెలియలేదు. పృథూ! నే నీబాధ నింక నోర్చుకొనలేను.

పృథువు : ద్వ్యాపీతకా! నీవు వేనరాజును గొనిపోయి యా సుఖశయ్యయందుఁ బరుండఁబెట్టుము.

[ద్వ్యాపీతకుఁడు వేనునితో నిష్క్రమించును]

అంగరాజు : నాయనా! నీవు చక్రవర్తివయితివి. ఇవే నా యాశీస్సులు. నే నింక నడవుల కేగుచున్నాను.

[నిష్క్రమించును]

గౌతముఁడు : చక్రవర్తీ! బ్రాహ్మణుఁడనైన నేను నీయాజ్ఞ పొంది తపస్సున కేగుచున్నాను. [నిష్క్రమించును]

పృథువు : పెండ్లికూతురా! వసుంధరా! సిగ్గుపడెదవేమే? నీవు నాచిటికినవ్రేలు పట్టుకొనుము. నన్ను వరించుకొని యింతదూరము తెచ్చుకొని యిప్పుడుసిగ్గెందులకు? అదుగో? ఆకసమువంకఁ జూడుము.

గురువులలో నెల్ల గురుతముండు పవిత్రము తపోనిధి వశిష్ఠమునికి భార్య
కాంత ప్రతాపురోగణనీయ, వ్యాతిపన్ని ధానమానవుల కదర్శనీయ
రమణీ గావై వాహాసమ ఘనూతనవఘూ తారుణ్యజనపురోదగ్నీయ
సప్తర్షి మండలచ్ఛవిహారనాయక మణ్యధస్థ్సలలంబమానముక్త

ఆ యరుంధతీనక్షత్ర మరసి చూడుము
దూరమున నుత్తరమ్మున ధ్రువుఁ జూడుము
చారుజలజాతనూత్న కేసరము లంటి
వీచుచున్నది యీ వాయువీని చూడుము.

[తెరలో]

రాజర్షీ! పృథుచక్రవర్తీ! వేనుసబాధలవలన ప్రజలందరు వ్యాధిగ్రస్తులై పోయిరి. దేశమునందు నానావ్యాధులు ప్రబలినవి.

పృథువు: ఓహో! ప్రజలార! మీ మొఱ్ఱ నా చెవులఁబడినది. నా వాక్కుమాత్రమే వసుంధరతో మాటాడుచున్నది కాని నామనస్సు మీమీఁదనే యున్నది.

వసుంధర: ఆర్యపుత్రా! ఇదిగో! మనము హిమవత్పర్వత ప్రాంతకాంతారదేశములకు వచ్చితిమి.

పృథువు: సఖీ! యీ పర్వతరాజును జూచితివా! గంగాయమునలు ప్రవహించినంతమేర దక్షిణమాలామూర్తిగానుండి కాశ్మీరదేశమున నుత్తరమాల ఘటించి తల్లి పొదుగునఁదలఁజోఁపువత్సమువలె నున్నాఁడు. ఉత్తమ మాహేయికవైన నిన్నుఁజూచి కాఁబోలు క్షీరార్థి యీపర్వతరాజిట్లగుట.

వసుంధర: ఈ మహాచక్రవర్తి నన్ను గోవునుజేసి యీ పర్వతరాజును వత్సమును జేసి యోషధులు పిదుక నెంచుచున్నాఁడు.

పృథువు: ఓయి! భగవానుఁడా! చంద్రుఁడా! నీకు నమస్కారము. ఓషధీశుఁడవైన నీయనుజ్ఞతో సర్వసరిత్కాననమైన యీ భూమినుండి హిమవంతునివలనఁ జేపించి యోషధులు గ్రహించుచున్నాను.

[తెరలో]

లోకేశ్వరా! లోకరక్షాపరా! ఈ హిమవన్నగధాత్రి నుండి వీచు గాలులు తగిలి లోకము నిరామయమైనది.

పృథువు: దేవీ! వసుంధరా! నాదేహ ముత్పులకమగుచున్నది.

చల్లనినీటిబిందువుల చాలునకన్నఁ బ్రభాతకాలసం
ఫుల్లనవారవిందజము ముగ్ధము తేనియకాల్వకన్న ను
న్వెల్లికి నొగ్గుపాల్కడలి వీవలికన్న మనోహరమ్ము నీ
చల్లనికాఁగిలింత యొకసారి ఘటించఁగదే, వసుంధరా!

[స్పర్శ]

వసుంధర: ఆర్యపుత్రా! నీచల్లని యీ సుఖస్పర్శచే వృద్ధి పొందుచున్న నాకు వేనుఁడు బ్రదికినట్లే లేదు. అతని బాధలు నే ననుభవించినట్లే లేదు.

పృథువు: నామనస్సున కతఁడు పుట్టినట్లే లేదు. చనిపోయి నట్లే లేదు.

భరతవాక్యము

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా సుఖినో భవన్తు.

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.

౧౨౦

# శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి గ్రంథములు

| | |
|---|---|
| శ్రీమద్రామాయణ కల్పవృక్షము - | |
| అయోధ్యాకాండము | 4-0-0 |
| అరణ్యకాండము | 4-0-0 |
| వేయిపడగలు | 12-8-0 |
| మాబాబు | 3-0-0 |
| ఏకవీర | 3-0-0 |
| చెలియలికట్ట | 3-0-0 |
| బద్దన్న సేనాని | 3-0-0 |
| జేబుదొంగలు | 3-0-0 |
| ధర్మచక్రము | 3-0-0 |
| స్వర్గానికి నిచ్చెనలు | 4-8-0 |
| నర్తనశాల | 1-8-0 |
| అనార్కలీ | 1-8-0 |
| వేనరాజు | 1-8-0 |
| త్రిశూలము | 1-8-0 |
| కిన్నెరసాని పాటలు | 1-8-0 |
| ఆంధ్రప్రశస్తి | 1-8-0 |
| ఝాన్సీరాణి | 2-0-0 |
| విశ్వనాథ పంచశతి | 2-0-0 |
| మాస్వామి; తెలుగు ఋతువులు | 1-4-0 |
| శశిదూతము | 1-0-0 |
| వీరవల్లడు | 1-0-0 |
| హాహాహూహూ | 1-0-0 |
| కావ్యవేద హరిశ్చంద్రులు | 1-0-0 |

